ఫోన్: 2066 టెలిగ్రామ్: హిందీసంఘ

సంపుటి 6 సంచిక 8

# ప్రవంతి

సాహిత్య మాసపత్రిక

*

సంపాదకులు

వేమూరి ఆంజనేయశర్మ

సి. నారాయణరెడ్డి

*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

6-2-959, ఖైరతాబాదు — హైదరాబాదు - 4.

| సంవత్సర చందా | నవంబరు, | విడిప్రతి |
| --- | --- | --- |
| రు. 3-0-0 | 1959 | రు. 0-4-0 |

**Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.**

## ఈ సంచికలో

సంపాదకీయం

# హిందీ వారోత్సవాలు

అక్టోబరు 2 వ తేదీ గాంధీ మహాత్ముని జన్మదినం కావడాన్ని పురస్కరించుకుని మనదేశంలో ముఖ్యంగా ఆంధ్ర ప్రాంతంలోనూ ఆంధ్రరాజధాని నగరంలోనూ హిందీ వారోత్సవాలు అత్యంత వైభవోపేతంగా జరిగాయి. మనదేశానికేగాక యావత్ప్రపంచానికీ అహింసా మార్గం చూపిన యుగపురుషుడు గాంధీ మహాత్ముడు. ఆయన ఏర్పరచిన నిర్మాణ కార్యక్రమాలలో హిందీ ప్రచారం ఒకటి. భారతీయులందరినీ ఐక్యపరచడానికి హిందీ ఉత్తమ సాధనంగా ఆయన స్వీకరించారు. కనుక హిందీ విషయంలో మహాత్ముడు అవలంబించిన విధానాలను దేశీయులు సవ్యంగా అనుసరిస్తే దేశంలో హిందీ వ్యతిరేకతకు తావుండదు మన హిందీ ప్రచారోద్దేశం హిందీని బలవంతంగా అందరిమీద రుద్దడంకాదు ప్రాంతీయ భాషాభివృద్ధిద్వారా హిందీ భాషాభివృద్ధిని మనం కాంక్షిస్తున్నాం. ప్రపంచంలోని వివిధ భాషలతో, వివిధ భాషలలోని సాహిత్యంతో మనకు పరిచయం కలిగించుకోడానికి ఇంగ్లీషు ఏవిధంగా తోడ్పడుతున్నదో అదేవిధంగా మనదేశంలోని వివిధభాషా సాహిత్యాలతో సాన్నిహిత్యం ఏర్పరచడానికి హిందీ ఉపయోగిస్తుంది.

ఆంధ్ర ప్రదేశ్ హిందీభాషా సేవకులకు పెట్టనికోట. ఏటేటా అసంఖ్యాకంగా జనులు హిందీ భాషాభ్యాసం చేస్తున్నారు. ఇది ఒక శుభ సూచన. ఈ సంవత్సరం అక్టోబరు మొదటి వారంలో ఆంధ్ర రాజధానీ నగరంలోనూ ఇతరత్రా జరిగిన హిందీ వారోత్సవాలు ఇందుకు ఇతోధికంగా దోహదం చేసినవి. విద్యావేత్తలు, కవులు, భాషాభిమానులు, సామాన్యజనం అంతా మహోత్సాహంతో ఈ ఉత్సవాలలో పాల్గొని విజయవంతం చేశారు. బహు భాషలకు

చెందిన కవులు ఈ ఉత్సవాలలో పాల్గొన్నారు. వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ అధ్వర్యాన దక్షిణాదిని జరుగుతున్న ఈ హిందీ మహోద్యమం యావత్ భారతదేశంలో సమైక్యతకు కారణభూతమై ప్రాంతీయభాషా వికాసానికి తద్వారా రాష్ట్రభాషా వికాసానికి తోడ్పడి ముఖ్యంగా భారతీయ సాహిత్య సమభివృద్ధికి దోహదం చేస్తున్నది.

హిందీ వారోత్సవాలను దిగ్విజయం చేయడంలో తోడ్పడిన వారికందరికీ 'స్రవంతి' తన ధన్యవాదాలను సమర్పిస్తున్నది.



కవిత :

# మానవుడా! మేలుకొనుము

—శ్రీ కనపర్తి

మానవుడా - మానవుడా
మాంద్యము నిక వదలుకొనుము
మానవతాప్రాంగణాన
మహస్సులను నిలుపుకొనుము.

పురిటినొప్పులను రోదసి
మూల్గినపుడు నీవు లేవు
పూర్ణాయువుతోడ పుడమి
పుట్టినపుడు నీవు లేవు.

పదపడి ఇన్నూరుకోట్ల
వత్సరాల పిదప పుట్టి
మానవుడా ఎంతెంతటి
మహత్కార్యములగంటివి !

రెండున్నరలక్షలేండ్ల
నిండగు కాలముక్రిందటి
నారసింహ యుగమందలి
నరుడా - మానవుడా ! నీ
గతచరిత్ర నొక్కసారి
కన్నులందు నిల్పుకొనుము
కాలానికి నాగరకత
కట్టిన గోరీల గనుము.

భూగోళపుటంచుల నీ
పోలికలను గాంచినపుడు
శాస్త్రజ్ఞులు నీగూరిచి
చర్చలు సాగించినపుడు ;

నీలోపలి చైతన్య
శ్రీల స్మృతికి దెచ్చుకొనుము,
మానవుడా ! మానవుడా !
మాంద్యము నిక వదలుకొనుము.

గతకాలం నీకోసం
కట్టిన కత్తులవంతెన
దాటుటకై నీవు పడిన
పాటుల స్మరియించుకొనుము.

"ట్రినిల్" ప్రాంతమందున దొరి
కిన ఫాలభాగంలో
శాస్త్రజ్ఞులు నీ జీవిత
చరిత్రలను చదివినారు.

"గచ్ఛన్నరవానరుడవు"
గా నీవు చరించినట్టి
'అనేక తావుల' లో నీ
అడుగుల పసికట్టినారు.

"హైడిల్బర్గ్" సీమలోన
జాడపడిన అస్థికలో
వింతగొల్పు నీ గాథల
సంతరించగల్గినారు.

"నేండర్తల్" నేలయందు
నెలసిన నీ "పుర్రె" లోన
నీ నరాల ప్రవహించిన
మానవతను తూచినారు.

నీకు పెట్టబడిన పేర్లు
కోకొల్లలు మానవుడా !
నీవు దాల్చినట్టి రూపు
లే వందలు వెలుగదా !

మానవుడా నీదు జన్మ
మహోత్కృష్టమైనదిలే.
మానవుడా నీ చరితం
మహోన్నిత మ్మైనదిలే !

కాలపు గమనపు "సుడి"లో
గోళపు భ్రమణపు "వడి"లో
దాల్చిన నీ రూపమ్ముల
దలచుకొనుము మానవుడా !

మరగిపోయె యుగయుగాలు
మహాయుగమ్ములు గడచెను
మన్వంతరములు భూమికి
మహదాశీస్సుల నొసగెను.

శాస్త్రజ్ఞులు యుగాలుగా
సాగించిన శ్రమయంతా
సర్వతోముఖాభివృద్ధి
సాధించిన నాగరకత ;

క్షణములోన రూపుమాపు
అణుబాంబుల గనిపెట్టెను
మారణహోమానికి బలి
మానవతను దలపెట్టెను.

పృథ్విని భస్మమ్ముచేయు
బృహత్ప్రయత్నమ్మునందు
అణుశాస్త్రజ్ఞులు తమ ఉని
కిని సంపూర్తిగ మరచిరి.

తమ చేతుల తమ సంతును
ధ్వంసముచేయగ నెంచెడు
"స్వల్పజ్ఞులు" నీ జాతిని
జన్మించుట దుఃఖకరము.

అట్టి "స్వార్థపరులు" భూమి
కాధిపత్యమును వహించి
మానవతను భయపెట్టుట
మరియింత విచారకరము.

ఇట్టి విపత్సమయమందు
ఎట్టుల వర్తించెదవో
త్వరపడి మేల్కొని నీ క
ర్తవ్యము నెరవేర్చుకొనుము.

మానవుడా ! మానవుడా !
మాంద్యము నిక వదలుకొనుము
మానవతాప్రాంగణాన
మహస్సులను నిలుపుకొనుము.

# రస స్వరూపము

—శ్రీ యస్. పానయ్యా చౌదరి

రసము పదార్థవాచకము, భావవాచకము. రెండును ప్రస్తుత విషయాంశములో నిట భావద్యోతకమే. రసోత్పత్తి శ్రోత లేక ప్రేక్షక హృదయములలో గలుగును. కావ్యములు ప్రయోజన దృష్ట్యా దృశ్య, శ్రవ్యకావ్యములుగా విభజింపనగును. దృశ్యకావ్యమునకు సహృదయుడగు ద్రష్ట మరియు శ్రవ్య కావ్యమునకు సహృదయుడగు శ్రోత ప్రధానులు. అనగా నిట కావ్యకర్త కంటె మిన్నలని యర్థముగాదు. "రససిద్ధాః కవీశ్వరాః" అనియు "కవయతే సర్వంజానాతి సర్వం వర్ణయతి సర్వం సర్వతోగచ్ఛతివా కవిః" అనియు రవి గాంచలేని చోటును గవి గాంచుననియు, వివిధ బుధవరేణ్యులు చెప్పియే యుండిరి. రసోత్పత్తి, రస పరిపక్వమును గలుగజేయునవి లలితకళాఖండములే. అనగా కావ్యకళ, సంగీతకళ, చిత్రకళ, శిల్పకళ మొదలగునవి. అన్నింటను, ప్రధానమైనది కావ్యకళ. అది మానవుని హృదయాంతరాళములోనికి జొచ్చి, భావతరంగములను, ఉత్థాపనచేస్తుంది. భావ మన నిటస్థాయీభావము. స్థాయీ భావములు ప్రతి మానవుని హృదయమునందును, సుప్తములై యుండును. వానిని జాగృత మొనరించునదే విభావము. ఆలంకారికులు దీనిని ఆలంబన విభావ మనియు, ఉద్దీపన విభావ మనియు రెండుగా పేర్కొనిరి. ఆలంబన విభావము పాత్ర, పాత్రీ, వస్తు ప్రధానము. ఉద్దీపన విభావము శృంగారమున చంద్ర, చందన, మలయానిలోద్యానాదులు ఆలంబమునకు సహాయకారియై నడచును. అప్పుడు స్థాయీభావ ముద్బుద్ధమై, అనుభావరూపము దాల్చును. అది క్రియ, చేష్టాదులతో గూడియుండును. ఈమూడు భావముల సమ్మేళనము జరిగినప్పుడు సంచారీ లేక వ్యభిచారీ భావము తొలకరి మెఱుపువలె తళుక్కున మెఱయును. దానితో రసము పరిపక్వస్థితికి వచ్చును.

నాట్యశాస్త్రజ్ఞుడైన భరతముని రసమునుగురించి యిట్లు నిర్వచించి యున్నాడు. "విభావానుభావ వ్యభిచారభావ సంయోగాత్ రస నిష్పత్తిః." ఇట నిష్పత్తి శబ్దమునకు పలువురు శాస్త్రజ్ఞులు పలువిధముల వ్యాఖ్యాన మొనర్చిరి. ఏది యెటులైనను త్రిభావముల సమ్మేళనమువలననే స్థాయీ భావము రసరూపము పొంది పరిపక్వమగునని అందఱు అంగీకరింతురు.

రసోత్పత్తి సమయమున భావగ్రహణము జరుగును. అది లేనప్పుడు హృదయమునకు మధురభావములను చవిచూచుట చేతకాని పని. హృదయము తన కార్యము తాను సరిగా నెరవేర్చుటకు, బుద్ధి తీవ్రశక్తిగలదై యుండవలయును. అందువలననే ఒకే రూపకమును, లేక ఒకే మహాకావ్యమును, చూచి, విని, లేక చదివి అందరును, సమానమైన నవ రసములను, తమ మనములయందు సృష్టించుకొనజాలరు. ఒక వేళ అట్టి కార్యము జరిగినను, పలువురియందును నది తర, తమ భేదములను జెందును. బుద్ధిఆలోచనా ప్రధానమైనది. బుద్ధి, హృదయ వ్యాపార సమ్మేళనముతో భావసంచలనము జరుగును. భావములను కలిగించు శక్తి, కవి కలమునందును, చిత్రకారుని తూలికయందును, శిల్పియొక్క కొనదేరిన వులియందును, గాయకుని మృదు, మధుర స్వరమునందును, మాత్రమేయుండును. వారివారి శక్తినిబట్టియే వారివారి కృతములు సొబగు నందుచుండును. అందువలననే సంస్కృతమున కాళిదాస మహాకవి సమకాలికులకే గాక సంస్కృత కవులందరికి తలమానిక మయినాడు. అటులనే హిందీ సాహిత్యమునందు గోస్వామి తులసీదాసున కున్న ఘనత మరియే యితర హిందీ కవికి లేదు. తెలుగున నన్నయ, తిక్కన, పోతనాదులు తెలుగు వారికి నారాధ్య కవులైనారు. కావున రససృష్టి చేయగల కవుల అభివ్యక్తి పరంపరలు తమతమ శక్తులలో భేదరూపమును దాల్చినట్లే రసాస్వాదన చేయగల శ్రోతల, ప్రేక్షకుల హృదయాంతరాళములు భిన్నభిన్న లోతులను గలిగి యుండునని తెలుచున్నది

రసము రూపరహితమై, అనుభవైకవేద్యమయినది. మూగవాడు బెల్లమును దిని తీపిదనమును అనుభవించగలడు. కాని అది యిట్లున్నదని వర్ణించలేడు. అటులనే భాష, ఉచ్చారణగల మనుష్యుడుగూడ రసానందము ననుభవించునేగాని, అది యిట్టిదని వర్ణించి చెప్పజాలడు. అట్లు చెప్పజాలినది యేదైన యున్న యది రససంబంధమయినది కాదని తేలికగా చెప్పవచ్చును కావున రసస్వరూపము నిర్గుణ పరబ్రహ్మమువలె రూపరహితమై, శాశ్వతమై యుండునని చెప్పుట సాహసముగాదు.

రసానందము బ్రహ్మానంద సహోదరము. బ్రహ్మానందము త్రికరణశుద్ధి గలిగి, పూర్వజన్మసుకృతము గలవారికి లభించునని యందురు. అది సమస్త ఆనందదాయకములయిన వస్తు, భావాదులకంటె నుత్కృష్టమయినది. అందువలననే మహాత్ములు తద్భోక్తలగుటకు నారాటపడుచుందురు. సహోదర

శబ్దార్థము ఏకగర్భజనితులని యర్థము. కావున రసానందముగూడ బ్రహ్మానందము వంటిదని తేటతెల్లమగుచున్నది.

రసానందమున, వ్యక్తి ఇహమును మరచి, సమాధిస్థ యోగిపుంగవునివలె మరొక లోకమున విహరించును. అందువలననే మనము రామాయణమును చదివియో లేక వినియో అశోకవనమునన్న సీతతో దుఃఖింతుము. సీతాన్వేషణకై బయలుదేరిన శ్రీరామునితో కలసి జాలిగా జేలలవలె దీనదృక్కులను ప్రసరింపజేయుదుము. రావణుని క్రూరకృత్యములకు, రోషారుణ నేత్రుల మగుటయేగాక ఒక్కొక్కప్పుడు పాత్రదూషణగూడ కావింతుము. దీనినే సాధారణీకరణము (generalisation) అందురు. కావ్యగత లేక నాటకగత పాత్రలను తాత్కాలిక పాత్రలుగా గుర్తించక సహచరులుగా భావించుటయే దీని ముఖ్య విశేషము. సాధారణీకరణము అను భావము ఉత్తమకావ్యాదు లయిననే గాని జరుగదు. అట్లుగానిచో మనకు శకుంతల మునికన్యగాను, దుష్యంతుడు రాజుగానే కన్పట్టుదురు. అప్పుడు మనము వారితో కలిసి సహచరించలేము. సహచరభావములేనప్పుడు వస్తువు అప్రధానముగానే కన్పట్టును. తత్కారణమున అన్యభావ్య ముద్భవించును. తత్ఫలితముగా సహానుభూత్యాది భావములు నశించును. అప్పుడు కావ్యము రసహీనమైన పిప్పివలె కవికి కళంకమును మాత్రమే సమకూర్చగలుగును. అట్టి రచనను కావ్యమనుటగూడ పరిహాసప్రాయమే యగును. కావ్యరచన కవికి చెందినది. కవి రససిద్ధుడుగా నుండునుగాని, రసహీనుడుగా సుండడు

కావున, రసము ఉత్కృష్ట కావ్యాదుల కారణముగా పాఠకులు మొదలగువారి హృదయములలోని, స్థాయీభావములను జాగృత మొనరించి, వారికి అమందానందము నిచ్చుచూ, విగళిత వేద్యాంతరము, బ్రహ్మానంద సబ్రహ్మచారి యైన రసానందము విభావానుభావ సాత్త్విక వ్యభిచారభావాదులచే అంకురితమై, పల్లవితమై, పుష్పితమై, ఫలితమై, పరిణతమై లోకకాలాది పరిస్థితుల కతీతమై, శాశ్వతమైయుండు నొక పవిత్రభావమని యర్థము. అదియే శాంతి మరియు ఆనందదాయకము. "రసో వై సః రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అని ఉపనిషత్సూక్తి.



# సీతమ్మ సంబరం

— శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు

తనవారు చనుదెంతురని విన్న సీతమ్మ
పిడిచి పయ్యెద ఆరబెట్టుకొన్నది వేగ
తరువాత చిరుచాప పరచి పై నది వెట్టి
నునుపార మడిచి పెట్టెన దాచుకొన్నది.

కోర్కెతో కుట్టించుకొన్న ముక్కున తెచ్చి
క్రొత్తపూచికపుల్ల గ్రుచ్చుకొన్నది త్రుంచి ;
ప్రక్కింటఁగల ఆడబడుచు దాల్చిన చిన్న
నకిలీ గొలుసునుపై మనసుపడ్డ దొకసారి,

తేపకు అద్దమ్ములోపల గని బొట్టు
దిద్ది మో మిట్టట్టు త్రిప్పి బేసనుకొనె
తనభర్త యేదిచెప్పిన దాని త్రుటిలోన
చేసి రావలెనంచు ఆసతో తలపోసె.

పెరటిలో గల పూలు సరులుగా కూర్చెను
సరిగ ముచ్చెనగుంట దరివెట్టమని అమ్మ
కరములంబెట్టి వెన్కకుమళ్ళి నిలచెను-
ఏదేదో తలపోసి ఎడదలో నుప్పొంగె.

పతి రాగ, కనులలోపలఁ జూడగా సిగ్గు
పడి, పాదముల జూచి వందనమ్మర్పించె ;
గౌరమ్మగూటిదగ్గర నిల్చి పెనిమిటి
కనురాగమును బెంచుమని మ్రొక్కె లోలోన.



# పరిత్యాగము

—ఎమ్. సుదర్శనాచార్యులు

[శుద్ధోదనుని రాజప్రాసాదము. రాకుమారుడగు గౌతముని భవితవ్యమును గురించి శుద్ధోదను డాలోచించుచుండెను]

శుద్ధోదనుడు : రోజులు గడిచిపోవుచున్నవి. దైవజ్ఞులు వచించినది తథ్యము కానున్నదేమో ! ఎంత ప్రయత్నించినను గౌతమునిలో మార్పుకల్గుటలేదు. ఎందఱెందఱో విజ్ఞానవేత్తలతో వాని స్వప్నవృత్తాంతమును గురించి చర్చించితిని. వారందఱు నాపై బగబూనినటుల గౌతముడు రాజ్యమును పరిత్యజించి లోకోత్తర పురుషుడై ప్రకాశింపగలడని నొక్కి వక్కాణించిరి. శారీరకముగ, మానసికముగ సంకటమన నేమో గ్రహించుటకు వీలు లేకుండ ఎన్నో వసతులను గల్గించినప్పటికి వానికిగల ఆత్మజిజ్ఞాసాభిలాషను మార్చలేకుంటిని. పుత్రుడుండియు, నా తదనంతరము రాజ్యమెవని పరమగునో తెలియక నేను పడుచున్న బాధ వాని కెట్లు గ్రాహ్యమగును? తల్లితండ్రులు ప్రేమించుటయేగాని ప్రేమింపబడుట సంతానము నుండి నోచుకొనలేదేమో ! నామాట పాటింపకున్నను యశోధరమాటనైన వినవచ్చును గదా !

యశోధర : (ప్రవేశించి) మామగారికి నమస్కరించుచున్నాను.

శుద్ధో : గౌతముని సమాచారమేమి ?

యశో : చింతాక్రాంతులై యున్నారు.

శుద్ధో : ఇంకను ఆలోచనలోనే మునిగి యున్నాడా ?

యశో : ఆలోచించుటలేదు. బాధపడుచున్నట్లున్నారు.

శుద్ధో : (బాధతో) కారణమేమి ? ఇంత ప్రశాంతమైన వాతావరణమునందు సంతసమునకు బదులు సంతాపము కలుగుటకు అవకాశమే లేదు. ఎవరైన మృత్యువును గురించికాని, ముదుసలితనము గురించికాని, దుఃఖము, బాధ, రుగ్మత మొదలగు వానిని గురించికాని ప్రస్తావన తెచ్చిరా ? ఎంతసేపు నృత్య మొనర్చినను అలసినట్లు కాని, బాధపడునట్లు కాని కన్పడరాదను నా ఆజ్ఞను ఏ మత్తకామినియైన ఉల్లంఘించినదా ? ఈ కోట కావల జరిగిన ఏ విషాదసంఘటనమును గురించి గౌతమునికి చెప్పియుండలేదుకదా ?

వాడిన పూలు, ఎండుటాకులు త్రుంచివేయవలసినదిగా ఆజ్ఞాపింపబడిన తోటమాలి నామాట జవదాటలేదుకదా ?

యశో : ఒక వారము రోజులక్రితము మీ కుమారు డెవరితో చెప్పకుండ రాజ భవనము వీడి పురవీథుల దిరిగి వచ్చెను.

శుద్ధో : నా ప్రయత్నము లన్నియు మంటగలిసి పోయినవి. ముందు జరుగబోవు పరిణామ మెట్లుండునో ఊహింపరానిదిగ నున్నది. ఏమి జూచి వచ్చెను?

యశో : తా మొక భయంకర దృశ్యమును జూచితిమని చెప్పిరి.

శుద్ధో : (విచారముతో) భయంకర దృశ్య మగుపించుట కవకాశ మెవరు కల్పించిరి ?

యశో : వచ్చినప్పటినుండి ఆహారము సరిగా గైకొనుట లేదు. నృత్యగీతవినోదముల యెడ విముఖత్వము జూపిరి. ఎవరితోడను మాట్లాడుటలేదు. ఏకాంతముగ చింతాక్రాంతులై కాలము గడుపుచున్నారు.

శుద్ధో : వాని విచారము దూరముజేయ నీవైన బ్రయత్నింపలేదా ?

యశో : (కన్నీరు దుడుచుకొనుచు) ప్రభూ ! నాకు గలిగిన విచారము భరింప రానిది. వారి మనోబాధ నెరుగ నెంతయో ప్రయత్నించితిని. వేడుకొంటిని. నాపై జాలిజూప మొరవెట్టుకొంటిని. తుదకు కన్నీటితో వారి పాదములను గడిగితిని. అప్పటి కొకింత కరుణగలిగి "నీవలన నాకు గలుగు సుఖములో ఎప్పుడు లోపమురాలేదు. కాని నే జూచివచ్చిన ఆ మనిషివలె మన మిరువురము జరాభారములో గ్రుంగిపోవలసి యుండును. అమృతధార లొలుకు నీ అధరముల నందగ జూచుకొని ప్రేమరాజ్య మెంతకాల మేలగలను ? కాలము మన యిప్పటి దృఢతర ప్రేమబంధమును త్రెంపి వేయగలదు. నీలోని సోయగము, నాలోని ఉద్వేగము మటుమాయము కాగలవు దినమంతయు వికసించి నేత్రానందము కలిగించు గులాబి కన్నెవన్నెలను చీకటి దొంగిలించి మరుగు పఱచునట్లు మన యీ ప్రాయమును కాలము కన్పడకుండ కబళింపగలదు. వన్నెలు అపహరింపబడిన గులాబి వంతతో వసివాడి పడిపోయి మట్టిలో గలియునట్లు, వయః పరిపాకము దాటిన మనము మిత్తివాతబడి నామరూపములు లేకుండ మృత్తికలో గలిసిపోయెదము. నేడు నేజూచిన దృశ్యమువలన గలిగిన ఈభావము తలపునకువచ్చి బాధపడుచున్నాను. నా హృదయమునందు అంధకారము అలముకొనినది. నాలోగల ప్రేమను, కరుణను, సౌజన్య

తను వినియోగించి కాలపురుషుని కాపురుషత్వమును కాదనగల మార్గ మన్వేషించుటయే నా మౌనమునకుగల కారణము." అని నాతో జెప్పినారు.

శుద్ధో: అతని ఆందోళన మనవసరమని అనునయ వాక్యములతో నచ్చజెప్పలేదా?

యశో: చెప్పితిని. మా ప్రేమఫలమగు పసిబిడ్డను చేతి కందిచ్చితిని. పసికిబుగ్గల పరవళ్ళను జూడకయే నాకు తిరిగిఇచ్చిరి. ముఖమునందు గాంభీర్యము మూర్తీభవించినట్లుగా తాము జూచిన సంఘటనను గురించి ప్రసంగించిరి. వారే యిటువచ్చుచున్నారు.

(దీర్ఘాలోచనములో మునిగి బాహ్యమునుమఱచిన గౌతముడు ప్రవేశించెను.)

శుద్ధో: కుమారా! నీ విషాదమునకు కారణమేమి?

గౌత: ఈ పురవీధులలో జరాభారమునకు క్రుంగి రోగముతో పీడింపబడు మనిషిని జూచితిని. అతని మోము అనుక్షణము తలపునకు వచ్చును. ఏ పని జేయుచున్నను, కనులు మూసికొని విశ్రమించుచున్నను, అది వలదన్నను ప్రస్ఫుటముగ గన్పించుచున్నది. నిశ్శబ్దముగ నున్నపుడు అతని మూల్గు నా చెవులలో గర్జించుచున్నది. "రా కుమారా! ఈ భోగముల నెంతకాలము అనుభవింపగలవు? మృత్యువునకు సిరిసంపదలతో, దుర్భర దారిద్ర్యముతో సంబంధములేదు. ధనవంతులని, నిరుపేదలని మృత్యువునకు విచక్షతలేదు. ఉక్కులాంటి దేహములు చెక్కుచెదిరి దిక్కులేక నల్లాడి మట్టిలో గలియగలవు. మరణించిన పిదప మట్టిలో గలియని దేహమునుండి బయల్వెడలు విషవాయువుల నెన్ని సుగంధ ద్రవ్యముల పరిమళమైనను దుర్వాసనా రహితముగా నొనర్పజాలదు. ప్రాణమున్నంత వఱకే భార్యాబిడ్డలు, శరీరసౌఖ్య మనుభవించెదమను ఆకాంక్ష. కనుక అన్నిటిని పరిత్యజింపుము." అను సందేశము నాచెవులలో మార్మ్రోగు చున్నది.

శుద్ధో: (తనలో) ఇతనితో వాదించుట నిష్ప్రయోజనము. కాదని చెప్పుట వలన మరింత బాధపడగలడు. (దాస దాసీ జనవర్గముతో) మీ నేర్పు నంతటిని సద్వినియోగపరచి రాకుమారునికి ఆనందము చేకూర్పుడు. (వాద్య సంగీతము ప్రారంభమయ్యెను. గౌతము డాలకించుచుండెను. కాని అతని దృష్టిలో దేవతలు పాడుచుండినట్లుండెను.) కుమారా! ఈ సంగీతమెంత మధురముగా నున్నది!! ఎచటికినేగక నృత్యవాద్యసంగీతములతో సౌఖ్యముగా కాలము గడుపుము.

గౌత : (గంభీరముగ) తండ్రీ! ఈ వాద్యసంగీతము వినుటవలన ఆనందమునకు బదులు మనోవేదన ఇనుమడించినది. ఆ వృద్ధుని మూర్ఖలో నాకు విన్పించిన సందేశమునే దేవతానీకము మఱింత ప్రస్ఫుటముగా తెలియజెప్పిరి.

శుద్ధో: (ఆశ్చర్యముతో) ఏమిటా సందేశము ?

గౌత : గాలి ఎప్పుడు నిశ్శబ్దముగానుండదు. ఏదేని ఒక సందేశమును విన్పించుచుండును. ఎంత ప్రయత్నించినను అనుక్షణము మోసికొనివచ్చు శబ్దము దూరముకాజాలదు. గాలివలె మానవుడు విశ్రాంతికి నోచుకొనడు. మానవుని జీవిత మొక రోదనము, ఒక నిట్టూర్పు, ఒక సంగ్రామము, ఒక తుపాను. మానవుడు తన పుట్టుపూర్వోత్తరముల నెఱుగనేడు. ఎచటి నుండి వచ్చునో, ఎచటికి వెళ్ళునో, ఎందుకు జన్మించెనో, ఎందుకు మరణించునో గ్రహింపుకొనలేడు. అహరహము సుఖ దుఃఖములతో సతమత మగుచుండును. అందులోనే ఆనందము, అందులోనే ఆవేదన ననుభవించుచుండును. శరీర సౌఖ్యముల కొఱకై స్త్రీమూర్తిని ప్రేమించుటకై ప్రయత్నించును. ప్రేమ శాశ్వతమని కలలు గాంచును. దేహమున్నంతవఱకు వాంఛ తీగలు సాగును. తదనంతరము వాంఛ నిర్మూలమగును. వాంఛను ప్రేమయని నిర్వచించు మానవుని ఆశయములు, అభిలాషలు, ఆవేదనలు బుద్బుదముల వంటివి. మీటిన తీగెలనుండి జనించు ధ్వని తరంగముల వంటివి. కాకున్న, ఎచట జూచినను ఏడ్పులు, పెడబొబ్బలు కన్పించుటేల? నేడు సంభవించిన కష్టములను రేపు ఆశించిన సౌఖ్యముల దృష్ట్యా మరపునకు తెచ్చుకొని వణకుచున్న పెదవులపై చిరునవ్వును గన్పింపజేయు మానవుని బ్రతుకంతయు పనికిమాలిన నటన మాత్రమే. అనుభవించుచున్నా ననుకొనిన మానవుని ఆనందము బ్రతికినంతవరకు భద్రపఱచుకొనుట అసంభవము. అట్టి ప్రయత్నము పరుగెత్తు వారిదమును చలనములేకుండ చేయుట వంటిది; చేతితో నదీప్రవాహము నడ్డగించుట వంటిది. కాని ఓ రాకుమారా! నీ వందఱు మానవులవలె అజ్ఞానమున మెలగుట తగనిపని. బాధాయుతమైన ఈమానవ లోకము నీద్వారా విముక్తి నాకాంక్షించు చున్నది. కనుక మేల్కొనుము. మాయకు లోనుగావలదు. ఈ గాలివలె నీవుకూడ స్థిరముగ నొకేచోట నిలిచి యుండక మానవలోకము నుద్ధరించుటకై పంచారము మొనరింపుము.

విషయ లాలసులకొఱకై ఈ నీ భోగభాగ్యములను వదలివేయుము." అను సందేశము నాకు వినవచ్చినది.

శుద్ధో : (భయముతో) వాద్యసంగీతము నాలకించినవాని కిట్టి సందేశము వినిపించుట విస్మయాస్పదముగ నున్నది భువిలో నెచట జరుగని అద్భుత సంఘటనలు సంభవమగుటకే బహుశా నిన్ను పుత్రునిగా బడయగలిగితి ననిపించుచున్నది. నీ హృదయావేదన మితిమీరుటవలన నేది వినినను, కనినను అది నీకే సంబంధించినదని భ్రమించుచున్నావు. భ్రమవలన సత్యాసత్యముల నిజస్వరూపము కనబడకుండును. దెబ్బ తగిలినప్పుడు బాధ కలుగుననుట తథ్యము. కాని ఎవనికో దెబ్బతగిలి బాధపడుటజూచి తనకే అది తగిలిన దని భ్రమించి పరితపించువాడు పిరికివాడని ఎరుగము. క్షత్రియకుల సంజాతకుడవగు నీకు పిరికితనము పనికిరాదు. నామాట విని నిశ్చింతగ నుండుము.

గౌత : తండ్రీ ! భ్రమించుచుంటినని నాయందుగల ప్రేమతో నింతదనుక ముచ్చటించితిరి. కన్నులతోజూచి, అంతరంగములో అనుభవించి, తప్పనిసరియైనదేదో గ్రహింపజాలిన నాలో మీరారోపించిన మతిభ్రమణ మెన్నటికి లేదు. నిన్న నేనొక విషాద దృశ్యమును క్రొత్తగ జూడగలిగితిని. బాటకు ప్రక్కగ నొక దురదృష్టవంతుడు బాధతో తనను రక్షించుటకు రానిచో మరణింపగలనని అరచుచుండెను. అతని బాధకు కారణ మెరుగక రథము నడుపు చెన్న నడిగితిని. అతడిట్లు చెప్పెను "ప్రభూ ! ఇతడు భయంకరమగు ప్లేగు వ్యాధితో బాధపడుచున్నాడు. ఒడలంతయు ముడుతలుపడి పెద్ద మచ్చలతో చూచుటకు అసహ్యముగ నున్నది. అరచుటవలన నోరెండిపోయినది. లోనికి గుంజుకొనిపోయిన కనుపాపలు పైకి ఉబుకని దుఃఖవార్ధిలో ఈదులాడుచున్నవి. ఆయాసముతో లేచినిల్చొనదలచి, అందిన గడ్డిపోచల సాయముతో కొంతవరకు పైకిలేచి త్రాణలేక మఱల చతికిలబడి దిక్కుకై దేవులాడుచున్నాడు. ఒకప్పుడు సక్రమముగ ప్రవహించిన ఈతని రక్తము వ్యాధివలన ఉడికి పొగలు గ్రక్కుచున్నది. ఒడుదుడుకులు లేకుండ పనిచేసిన ఈతనిగుండె నేడు పగిలిన ఢక్కావలె వినదించుచున్నది. ప్రత్యంగమునుండి బలము మెల్లమెల్లగ జారుకొనుచున్నది. బలహీనత వలన చేయదలచినది చేయలేక చీకాకుతో పండ్లు కొరుకుచున్నాడు. ఊపిరి నలుపని పొగవలె కష్టముమీద ఉచ్ఛ్వాసనిశ్వాస

లను వదలుచున్నాడు. చావ సిద్ధమైనను పీడించుచున్న వ్యాధి ముదురు నంత వఱకు బాధపడుట తప్పదు. నరాలపటుత్వము తప్పినపిదప ఎముకల సంధులు సడలిన తరువాత, మాంసమునంతయు తిని డొల్లయైన మృత కళేబరమును విడిచివెడలు రాబందువలె, వ్యాధి కన్పడకుండ బోవును. ఈవిధమైన బాధ ఏదో ఒక రూపమున ప్రాణికోటికి రాకతప్పదు. గాయముల వలననో, రుగ్మతవలనో బాధ శరీరమునందు ప్రవేశించి ప్రాణము పోవువరకు విడువకుండ పీల్చి పిప్పిచేయును. ఏనుగంతవాడు పీనుగై మరణించును. మరణించిన తరువాత ఆకలిదప్పులుండవు. ఆనందానురాగము లుండవు. అగ్నివలన భయముండదు. పంచేంద్రియ ముల ప్రసక్తి ఉండదు. రక్తమాంసములతో నిర్మింపబడినయీ దేహము నకు చివరకు కలుగు దుస్థితి యిట్టిదే గొప్ప వారైనను, అల్పులైనను, మంచివారైనను, చెడ్డవారైనను తుదకిట్టిదుస్థితిని అనుభవించి తీరెదరు. చనిపోయిన తరువాత మరల నెచటనో పుట్టెదరని పెద్దలు చెప్పుచుందురు. ఎచట పుట్టినను అనుభవించు బాధలకు, వ్యాధులకు మార్పుండబోదు ప్రాణుల కిది పరిపాటి ప్రభూ!

శుద్ధో: బాధానుభవము తప్పించుకొను మార్గము సంతోషముగనుండుట యగును. నీ కట్టి సంతోషమును గల్గించుటయే నా ఆశయము.

గౌత: మీరు నాకు సౌఖ్యములను గల్పించుచుంటిరి. కాని ఇతరులు బాధపడు చున్నప్పుడు, దాని నెరిగియు ఎట్లు సుఖింపగలనో అర్థమగుటలేదు.

శుద్ధో: (సేవకులతో) రాకుమారు నెచటకు పోనీయవలదు. ద్వారములనన్నిటిని మూసియుంచవలసినదిగా నా ఆజ్ఞ

(భయవిభ్రమావేశపరుడై శుద్ధోదనుడు నిష్క్రమించెను.)

యశో: (ప్రేమతో) నాథా! మీ తండ్రిగారి హృదయావేదన మీకు, మీ హృదయా వేదన వారికి అర్థముకాకుండ నున్నది. గాఢముగ ప్రేమించు నేను మీ హృదయము నర్థముజేసికొనగలను.

గౌత: యశోధరా! నీ అభిప్రాయము నిరాధారమైనదికాదు. నా భవితవ్యమునకు, నాకు మధ్య అవాంతరముగ నా తండ్రి నిలువదలచినాడు. నా అంతర్వాణి సత్వరనిర్ణయ మొనరించుకొనవలసినదిగ ఆజ్ఞాపించి పరుగెత్తించుచున్నది. ప్రపంచము నా రాకకు ఎదురుచూచుచున్నది. దానికొఱకు నేను పరితపించు చున్నాను.

యశో : ప్రభూ ! ప్రాణుల బాధలను బాపుటకై మమ్ము బాధించుట పాడియా? ఇదియేనా మీకు నచ్చిన మార్గము ?

గౌత : త్యాగమువలన గాని బాధావిముక్తి కలుగబోదు. నీవు నన్నెంతగానో ప్రేమించుచుంటినని చెప్పితివికదా! నీయెడగల నా అనురాగము కొలత లేనిది. తెలియని జీవులకొఱకై బాధపడుచుంటిని. వారి దుఃఖమునే ననుభవించుచుంటిని. నా హృదయమునందు బాధితుల ఆక్రందన ధ్వనులు మారుమ్రోగుచున్నవి. అందరి దుఃఖము నొక్కడనే ఎంతకాలము భరింప గలను ? ఎంతకాలము మీ ఆనందమునకై అజ్ఞానాంధ కారమున గనులు దెరచి చిందులాడగలను ? వెలుగును జూచుట కనులకు సహజ గుణము. జ్ఞాననేత్రము విప్పారి యున్నతరి తప్పటడుగుల ముప్పును విస్మరించుట మహాపరాధము. ఎచట నున్నను, ఏమి జరిగినను నేనునీవాడనే. ఈ విశాల ప్రపంచమునందు నా ప్రేమ కందరు పాత్రులే. ఆ అందరిలో నీవు ముందర నిలిచి యుందువు. ఈ ప్రాపంచిక విషయములను శృంఖలములను ఛేదించుట నా నిర్ణయము. ఎవరు నన్ను నిరోధింపజాలరు. నీవిక నిశ్చింతగ విశ్రమింపుము.

(అర్థరాత్రి చివరిసారిగ భార్యను, పసిపాపను జూడదలచి గౌతముడు విశ్రాంతి మందిరమున ప్రవేశించెను. యశోధర నిద్రించుచుండెను. ఆమె కనులార్ద్రములై యుండెను పసిపాప ఆమెను హత్తుకొని నిద్రించుచుండెను. వారిని జూచుచు నిలబడిన గౌతమునికి వెంటనే వెళ్ళిపోవుటకు కాళ్ళాడలేదు. కర్తవ్యము సడలిపోవుట లేదు. తుదినిర్ణయమునకు వచ్చుట బాధాకరముగ దోచినది. కృత నిశ్చయుడై వారిపైనుండి దృక్కుల మరల్చుకొని గౌతముడు బిరబిరనడిచి పోయెను. యశోధర, ఆమె ముద్దుబిడ్డ ఆసంగతి ఎరిగియో ఎరుగకుండగనో కలవరించిరి.)



# నీవు నాలోనె....

—శ్రీ ఆర్. యస్. సుదర్శనం

నీవు నాలోనె యున్నావని తెలియుటకు
పట్టె నిన్నాళ్ళు ! నా మనోభ్రాంతి వాపి
జ్ఞాన నేత్రమ్ము దెఱచు ప్రకాశలవము
దోచి, దుఃఖజీమూతమ్ము దొలగె నేడు !

బయలువెడలితి నొకనాడు బ్రదుకుబాట
చంద్రు డుదయింపని ముది సంజవేళ...
చుక్కల వెలుంగె, త్రోవలో పరీమ
ళాన్విత మృదుభావస్వాదు లాలసతయె
మైమఱపుగొల్పి, యున్మాదినై మదాత్మ
పయనమొనరించె తుదిలేని పథమువట్టి !

కఠినశిలల, నెడారుల గాసిజెంది
సత్త్వహీనత, కన్నులజాఱు బాష్ప
వారి నిన్నభిషేకించి, ప్రార్థనమ్ము
నేయ గళముపీడనివేళ, చెదరు ధృతిని
గానవచ్చె నొకానొక జ్ఞానదీప్తి ;
సుస్థిరమహోజ్జ్వలత దిశాశోభగూర్చి
సర్వశూన్యత నేకత్వశాంతి యగుచు—
ఆ ప్రభాపుంజ 'నీవ-నే' ననుచు దెలిపె !

నిర్మల స్వాంతమున గల్గు నున్మీలనమ్ము
ఒక్క త్రుటిలోన సప్త వర్ణోత్సవమయి
పృథివి గగనమ్ము దరిజేర్చు విల్లుదోచె !
పంక్తివక్త్రుని ద్రెళ్ళించు స్వామిమూర్తి

శివధనుర్భంగవేళలో సీత హృదిని
తనది గానించుకొను స్వామి తరళమూర్తి.
తన్మహూర్త నిష్యందమై తత్త్వమసిగ
పృథివి గగనమ్ము ముంచెత్తు వెలుగు నించె।

కలిగెచీకట్లు, తనివార గురిసెవాన
చెట్లు చిగిరించె, శాద్వల సీమలెల్ల
నూత్నరాగశోభితములై రత్నమయ వి
లాసవేదికాభ్రమ నొప్పె - లాస్యరక్తి
నచట మందార వృక్షము లల్ల జార్చు
పూల యెఱ్ఱని కాంతుల పూత లలమి।
ప్రకృతి నవవసంతాగమన కళ నొక్క
దివ్య స్వప్నాన, తన్మయోద్వేగ పరత
పులకిత లతాంగియైన యీ పుణ్యవేళ
తెలిసితిని - నీవు నాలోనె - వెలసితివని॥

---

గ్రంథస్వీకారం

| | |
|---|---|
| సాంప్రదాయం | శ్రీ కె. వి. రెడ్డి, శ్రీ బి. బి. రాజు |
| మహాశ్వేత | శ్రీ స్ఫూర్తిశ్రీ |
| న్యాయమందిరం | శ్రీ అంబటి |
| రౌడీ మల్లన్న | శ్రీ ఎం. ఏ. ఖాదర్ |
| అంగార వల్లరి | శ్రీ కె. వి. రమణారెడ్డి |
| భిల్లఫల్గునీయము | శ్రీ కట్టీ భీమలింగాచారి |
| జాగృతి | విజయదశమి ప్రత్యేక సంచిక జాగృతి కార్యాలయం, విజయవాడ-2. |
| విశ్వవీణ, | సాంస్కృతిక పక్షపత్రిక, |

సంపాదకులు: మసూనా శ్రీ శ్రీనివాస్ మొక్కరాల
విశాఖపట్టికేషన్స్, మెయిన్‌రోడ్, విశాఖపట్నం—౧.

# రామాయణ కల్పవృక్షము - ఒక విమర్శన

## పరిశిష్టము

—శ్రీ దుర్గానంద్

## 3

ఈ కవి వ్యుత్పత్తిప్రధానుడు. శబ్దార్థముల సంబంధములమీద ఈయన కున్న మమకారము అతివేలమయింది. ఈ వ్యాసములోని దోషములు పెక్కులు ఏతన్మమకార జన్యములే కాబట్టి ఈ శబ్దార్థసంబంధములమీద ఈయనకున్న అభిప్రాయములూ, అపోహాలూ, ఎలాంటివో తెలుసుకొనుట అత్యావసరము. ఈ అభిప్రాయములు జయంతి పత్రిక తొలిసంచికనుండి ఉద్ధృతములైనవి.

"సంస్కృతభాషలోఁ బర్యాయపదములు కొల్లలుకొల్లలుగా నుండును గదా. సంస్కృత భాషాశబ్దములు వ్యుత్పత్తిసహితములైనవి. ఎక్కువశబ్దములు ధాతుజన్యములు. కొన్ని భిన్నావయవముల యొక్క యర్థపోషకములు. అందుచేతఁ బ్రతిశబ్దమునకు యౌగికార్థము రూఢ్యర్థము రెండునుండును."

—అభిజ్ఞానశాకుంతలము

సంస్కృతభాషలో పర్యాయపదములు ఎక్కువ అని ఈయన అభిప్రాయము. పర్యాయపదములన్న ఒక వస్తువునకున్న అనేక నామములని ఈయన భావన. కాని పర్యాయపదములు ఒకేవస్తువునకు అదేఅర్థములోఉన్న అనేకనామములు కావు. శబ్దశాస్త్రదృష్టితోచూచిన పర్యాయపదములు ఒక వస్తువునకున్న వివిధనామములు కావనియూ అవి సంస్కృతభాషలోతప్ప అన్య భాషలలో లేకపోవుటకూడా లేదనియు తెల్లమగును. పర్యాయ పదములు వస్తువులకున్న గుణసూచకములగును. భావములకున్న అవస్థా సూచకము లగును. కోర్కె అనుపదమును ఉదాహరణముగా తీసికొనుడు. సంస్కృతములో దీనికి పర్యాయపదములు చాలఉన్నవి. వాంఛ, కాంక్ష, తృష్ణ, లిప్స, ఈహ ఇవియన్నియు నిఘంటువులలో ఒకేముడిని కట్టివేయుటవలన సాధారణముగా కోర్కెకు పర్యాయపదములుగా గ్రహింపబడుచున్నవి. కాని సూక్ష్మముగా పరిశీలించిన ఇవి ఒకానొక మానసిక వ్యాపారముయొక్క భిన్నదశలను సూచించు రూపములుగా తెలిసికొనదగును. ఒక అలభ్యవస్తువును పొందుటకు మనస్సుచేయు సన్నికట వ్యాపారము కోర్కె అనబడును. ఈ కోర్కె

కోరువానిని బట్టియు, కోరదగిన వస్తువునుబట్టియు, కోరుచున్న రీతినిబట్టియు, కోరగా వచ్చిన ఫలితమునుబట్టియూ, పై చెప్పిన పర్యాయపదములలోని వివిధ రూపములను ధరించును. వస్తుప్రాప్తిగతములైన ఈమానసిక వ్యాపారములే పర్యాయపదములు. ఈపరిస్థితి ప్రతిమానవునియందును, ప్రతిదేశమునందునూ కలదు కాన ఈభిన్న అవస్థా సూచకశబ్దములు అభాషలు వికసించిన మేరలో కొంచె మెక్కువతక్కువలుగా నుండును. ఆంగ్లమున desire, want, ambition, longing మొదలైన పదము లిట్టివేగదా. తెలుగులో తమి. కోర్కె మొదలైనవి కలవు. పాతప్రవచనములందు స్థూలదృష్టిలో గ్రహించిన ఇవి పర్యాయపదములేగాని మహాకవి ప్రయోగములందు నిర్దిష్టాంశములను సూచించుచునివి సార్థకశబ్దము లగుచున్నవి. అంతియేగాని ఒకరొకచోకూర్చొని సంస్కృతములో ఈశబ్దములను రాశిగా గ్రుమ్మరించిరనుకొనుట ప్రమాదము. ప్రపంచములో సాహిత్యము వృద్ధిగాంచినకొలది మానవుని మనోగోళములో భావసంఘర్షణ హెచ్చినకొలది ఇట్టిపర్యాయపదములు ఎన్నియో వెలసినవి.

ఇట్లే ఒకవస్తువునకు వివిధనామములు కలుగుటకూడ ఒక విచిత్రమైన సంఘటన. ఒకవస్తువునకు ఒకశబ్దము ప్రసిద్ధమై యున్నప్పుడు రెండవశబ్దముతో దానిని పిలుచుటకు మానవు డేల ఉత్సహించును. 'నేను' 'మీరు' అను సర్వ నామములకు పర్యాయపదము లేవే. ఇట్లే నిత్యజీవనావశ్యకములైన పదము లకునూ పర్యాయపదములు లేవు. ఉన్ననూ చాలతక్కువ. వ్యక్తులు, వస్తువులు గుణాశ్రయములు. వీటిలోని గుణములనుబట్టి ఆగుణముల సూచించునటుల పర్యాయపదములు వెలసినవి. ఈ గుణసందర్శనము చేయుటకు వీలైనపరిస్థితులు భాషాచరిత్రలో పలురకములుగా ఏర్పడియుండవచ్చును. శైలము, నగము, భూధరము, పర్వతము, గిరి అను పర్యాయపదములు ఎట్లేర్పడినవి ? శిల యొక్క రూపమును అనుభవించినప్పుడు శైలము అనబడినది. దాని చలన రాహిత్యమును అనుభవించినప్పుడు నగము అయినది. భూమిని పర్వతము ధరించుచున్నదను ధార్మికవిశ్వాసము కలిగిన చరిత్రదశను భూధరము సూచించు చున్నది. మీకాశ్చర్యము కలుగవచ్చును. పర్వతమునకు సంబంధించిన పైశబ్దము లన్నియు మాతృకదశలో సంస్కృతశబ్దములు కాకనూ పోవచ్చును. ఎన్నియో దశాంతరములు పొందిన శబ్ద, శబ్దవిన్యాసవ్యవస్థ ఒక కొంతకాలము గడచిన తరువాత ఒక నిశ్చిత వ్యవహార దశలో ఒక భాష పేరుతో పిలువబడును.

మొదటి సెలయేటి రూపముననున్న నదిని ఆ రూపములో దానిని విశిష్ట నామముతో పిలుచుటలేదు. హరిద్వారము నుండి వెలువడిన ఆ ప్రవాహ రూపమునే గంగానది యనుచున్నాము. ఇట్లే భాషలన్నియు. వీటిని విడగొట్టి వీటి తొలి రూపములలో వీటి యొక్క అనంతర రూపములను చూచుట కష్టము. పై చెప్పిన పర్యాయపదముల ఉత్పత్తిని మనము ఒకింత చరిత్రాత్మక పద్ధతిలో ఊహించవలయును. తొలి మానవజాతి నేటివలె ఏక సమాజరూపమున నుండక కొన్ని గుంపులుగనూ, తెగలగనూ ఆయా వేరు వేరు స్థానముల నాశ్రయించి యుండవచ్చును. అట్టి తెగలు ఆయా వస్తువులలో అనుభవించిన గుణములను బట్టి ఆ వస్తువులకు విడివిడిగా నామకరణము చేసి యుండవచ్చును. ఈ తెగలన్నియు కలిసి ఒక మహాజాతిగా ఏర్పడినప్పుడు ఆ తెగలు అంతకుపూర్వము సంతరించుకున్న వేరు వేరు పదములుకూడ ఒకే వస్తువునకు పర్యాయపదములై ఏక భాషకు స్వరూపమునూ, సమృద్ధినీ ఇచ్చినవి. ఆ భాష సంస్కృతము కావచ్చును. తెలుగు కావచ్చును. ఇంగ్లీషు, అరబీ ఏదైన కావచ్చును. పర్యాయపదములు రూపొందిన ఈ పరిస్థితిని గమనించినచో సంస్కృతములో పర్యాయపదము లెక్కువ అను భ్రాంతి దానంతటది అంతరించును. దీనితో పాటు సంస్కృతశబ్దములు వ్యుత్పత్తి సహితములన్న భ్రాంతికూడ గమనించ దగినది. సంస్కృతములోని ప్రతిశబ్దము వ్యుత్పత్తి సహితము అంతకన్నను గాదు. పలురకములుగా భాషలో మొట్టమొదట కొన్ని మాతృకశబ్దము లేర్పడును. తరువాత భాష అభివృద్ధి పొందినకొలది ఉపసర్గల పరసర్గల ద్వారా లేక ఇతర శబ్దముల కలయికవలన క్రొత్త యౌగికశబ్దము లుద్భవించును. ఈ భేదమును సూచించుటకే శబ్దములను రూఢములని, యౌగికములని విభాగము చేయు నవసర మేర్పడినది. యౌగికరూఢ శబ్దవిభాగము చేసిన మన పూర్వుల భాషాజ్ఞాన మీ విషయమున ఎంతటి సూక్ష్మవివేచనా దక్షమైనదో గమనింప దగినది. శబ్దములన్నియు ధాతుజములుకూడ కాదు. క్రియాసంబంధి నామములే ధాతుజములు. ఇక్కడకూడ ఒక విశేషమున్నది. బీజరూపమైన ఒక మూలక్రియా రూపము ధాతువు అను పేరుతో ఉండుననియూ, దానినుండి చిలవలు పలవలుగా వివిధకాలద్యోతక క్షమ ప్రత్యయాత్మకములైన సర్వక్రియలు పుట్టుచుండు ననియూ అనుకొనుట కూడ ప్రమాదము. మొదట 'గముల్' అని పుట్టదు. గచ్ఛతి, గచ్ఛ అను వ్యావహారిక క్రియలు పుట్టును. 'గముల్' అను ఒక మూలరూప స్థాపనము, ఈ సర్వక్రియలకు సంబంధించిన తెగలను, రూపములనూ

అర్థము చేసుకొనుటకు వీలుగా చేసుకున్న ఒక వైయాకరణ కల్పన, ఒక సూత్రీకరణ, ఒకరూప సాధనావకాశము మాత్రమే. దానినే వివిధరూపములకు మూలరూపమనుకొనుట అవివేకము. దీనినిబట్టి చూచిన తేలినదేమన వస్తువునకు ఏర్పడిన కొన్నిశబ్దములు గుణగతములు, కొన్ని క్రియాగతములు. వీటినే ఇంకొకమార్పుతో రూఢయౌగికములనీ, స్వాభావిక సాంకేతికములని పిలుచుచున్నాము. ముందు కొన్నిశబ్దములు మాతృకములుగా పుట్టి తరువాత విశిష్టార్థ ప్రయోజనముకొఱకు అవయవములను చేర్చగా అవి యౌగికము లగుచుండును. ఇవి కృతకములు. స్వతస్సిద్ధములైన రూఢములు, కృతకములైన యౌగికములు ప్రతిభాషయందును ఉండును. ఇల్లు, ఎద్దు మొదలైనవి తెలుగులో రూఢములు. రేయెండ, మగనాలి, ప్రామినుకులు మొదలైనవి యౌగికములు. ఇవి ఆంగ్లముననూ వేనకువేలున్నవి. ఈకవి చెప్పినట్లు సంస్కృతములో ప్రతిశబ్దము వ్యుత్పత్తి సహితము అయిన అది చాల కృతకభాష అయి యుండెడిదే. వ్యుత్పత్తిని ముందు ఊహించుకొని సంస్కృతభాషను తయారుచేసి ఉందురా? ఒక్తిది. ఇట్టి భ్రమ కలుగుటకు కారణము పాణిని వ్యాకరణము. సంస్కృతము మీద ఇంత పెద్ద వ్యాకరణమువచ్చి సూక్ష్మాతిసూక్ష్మముగా శబ్దావలోడనముచేసి ఒకప్రక్క సంస్కృతమునకున్న గొప్పతనమును ప్రపంచము నలుగడలా నిరూపించినది. వేరొకప్రక్క గ్రుడ్డిగా చదువుకొని పోయిన సంస్కృతజ్ఞులకు ఈ భాషయెడ వేయిమడుంగల భక్తిని అధికము చేసినది. ఆ వ్యాకరణము చేసిన అత్యంత సూక్ష్మ వివేచనమువలన సంస్కృతములోని ప్రతిశబ్దము కాదు ప్రతి అక్షరము శతధా చీల్చబడి అతికివేయబడినది. ఏతత్కారణముగా సాంప్రదాయిక పండితులకు సంస్కృతములోని ప్రతిశబ్దము వ్యుత్పత్తి సహితము అన్న భ్రాంతి కలుగుచున్నది. ప్రతి భాషయు ముందు వ్యావహారికదశలో ఉండి తరువాత గ్రాంథికమగును కదా! సంస్కృతముకూడ మొదట వ్యావహారికముగనుండి తరువాత సంస్కృతీకరింపబడినదనుట సర్వవిదితము. సంస్కృతమునకున్న వ్యవహారరూపము వేదములన్న ప్రబలసాక్ష్యము మనకు కనబడుచునే యున్నది. కాబట్టి సంస్కృతము అపౌరుషేయమేమియు కాదనియూ తోటిభాషలలో ఉన్నతమైన భాషలలో నొక భాషయనియూ గుర్తెరింగిన మనఅపోహలు చాలవరకు అపావృతములగును. దీనితోపాటు ప్రతిరూఢశబ్దమునకునూ అవయములుతీసి అర్థము చెప్పు పిచ్చియు తొలగిపోవును. విశ్వనాథవారు ఈ వ్యుత్పత్త్యావేశముతోడనే కాళిదాసాది మహాకవుల కావ్య

ముల నధ్యయనముచేయుచు కొన్ని భ్రాంతసిద్ధాంతములను ఏర్పరచు కొనినారు. అవి ఇవి.

"మహాకవులు సామాన్యపాఠకునకు స్థూలకథావస్తువునకు శబ్దమును రూఢ్యర్థములో ప్రయోగించుచుఁ దాముద్దేశించిన మహార్థములను లోతుగా దిగి చూచెడి పాఠకులకు వాని యౌగికార్థములతో సంతరింతురు" అభిజ్ఞాన శాకుంతలము—జయంతి, తొలిసంచిక.

అంటె ఈయన ఉద్దేశ్యము మహాకవుల ప్రతికావ్యమునూ మొదట శబ్దరత్నాకరాదులతోవచ్చు అర్థముతోచదివి రెండవసారి గురుబాలప్రబోధికతో వచ్చు అర్థముతో చదువమనియా? ఇది చాలఘోరము. మహాకవులు మహోన్నతములైన భావములను ఉపలక్షించి కావ్యములు వ్రాయుదురుగాని వ్యుత్పత్తులు, నానార్థములు, వ్యాకరణసాధ్య ప్రయోగములు ముందిడుకొనిగాదు. మహాకవులయొక్క మహార్థవివక్ష ధ్వనిలోనూ, ఉక్తివైచిత్రిలోనూ వ్యక్తమగును. కవియొక్క అర్థము స్థూలమైనదో లేక సూక్ష్మమైనదో కవియిచ్చు సంకేతమునుబట్టి యుండును గాని రూఢ్యర్థయౌగికార్థముల ప్రయోగమును బట్టికాదు. మహాకవుల మహార్థవివక్ష రూఢయౌగికార్థనిష్ఠమే అయినయెడల వారి కావ్యములు అనూదితములై అన్యభాషలలో ఏమి సాధించగలుగును? అనువాదములలో అవయవార్థములు ఎగిరిపోవునుగదా! కాళిదాసు విశ్వకవిగా పరిణింపబడుటకు కారణము ఆయన రూఢ్యర్థయౌగికార్థ ప్రయోగమేనా? అట్లైన సంస్కృత సాహిత్యములోని చిత్రకావ్యములే కాళిదాసుని కంటె ముందుబోయి విశ్వసాహిత్యములో అగ్రశ్రేణిలో కూర్చుండును. ఇట్టి వింతసిద్ధాంతమును సరియైన శబ్దశాస్త్రవేత్త చేయడు. విశ్వనాథ కాళిదాసుని శ్లోకములను ఈ దృష్టితోనే చూచి శ్లోకగతమైన ముఖ్యార్థమును విడిచి తన యూహలమీద వచ్చిన అవయవార్థ శకలములతో గాలిమేడను కట్టుకొనినాడు. కాళిదాసుని మహోన్నతభావములను విసర్జించి శబ్దశకలములతో ఆయన ఆత్మను పట్టుకొనబోవుట గురితప్పిన బాణములతో వేటపులుగును పట్టుకొనుటవంటిది. ఒక మహావ్యక్తిని ఏ గుణములతో అతను మహావ్యక్తి అయినాడో ఆ గుణములతోనే ఆరాధించుట సరియైన ఉపాసకుని లక్షణము. అట్లుగాక ఆ మహావ్యక్తిమీద లేనిపోని కొన్ని గుణములను తాను అనుకొన్నవి ఊహించుకొని ఉపాసించిన అనర్థమే కలుగును కాని మేలుగలుగదు. కాళిదాసున కున్న గుణములతో కాళిదాసుని పొగడవలయును. కాని తన కున్న గుణములను కాళిదాసు

నందు 'ఉన్న' వనుకొనునట్లు చేసి పొగడుట అపమార్గము. అనాదిసిద్ధమైన బ్రహ్మ తత్వమును దాని శక్తిని ఊహించలేక మన కున్న అల్పజ్ఞతలతో చిల్లర దేవతలుగా చేసి ఉపాసించిన మనలోని చిల్లరతనమే బయటపడును గాని ఆ మహోవ్యక్తిత్వమునకు కొఅంతరాదు. విశ్వనాథవారి అభిజ్ఞాన శాకుంతలము మీది పరిశీలనము ఇట్టిదే ఒక వింత వైఖరి. తన కవిత్వములో అవయవార్థ శకలములతో కూడిన బిగింపు దప్ప మహోన్నత భావ ప్రదీప్తి ఏమియూ లేదు. కాన తన కున్న ఆచార్యకమ్మన్యతాబలముతో తన కావ్యములలో నున్న లక్షణ ములకు అనుగుణమైన ఒక కావ్య విమర్శనా విధానమును తానే ఒకటి ముందు బయటపెట్టి దానిని కాళిదాసు మీద సమన్వయింపజేసి అద్దానినే తరువాత తనమీద కూడ అన్వయింపజేయుమని నిరీక్షించుటయే ఆయన శాకుంతల పరిశీలనోద్దేశ్యము.

నేను దీన్ని గురించి యింత ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే ముందు చూపెట్టబోయే కొన్ని ప్రయోగాలు పై చెప్పిన అపోహాలమీదే చాలవరకు ఆధారపడి ఉన్నవి. ఒక ప్రయోగం చూడండి సుమంత్రుడు దశథునితో ఆతని పుత్రాభావ దుఃఖానికి అనుధ్వనిగా సమవేదనాశీలుడై ఇలా అంటున్నాడు.

"నిద్రాహారము లెల్లమాని యిదిగో నీ మంత్రులున్ గాఢ శు
క్కద్రూసంభవదష్టులై మెలికలుంగాఁ జుట్టుకొంచుంద్రు"

నీ మంత్రులు అంటే మేము గాఢ శుక్కద్రూసంభవదష్టులమై బాధపడుతున్నా మని. వాళ్ళ బాధను వెల్లడించడానికి కవి గాఢ శుక్కద్రూసంభవ అను సమా సము వేసినాడు. దీని అర్థం గాఢమైన శోకము అనే పాములచేత దష్టులమై అని. శోకాన్ని పాముతో పోల్చడం బాగానే ఉంది కాని పాముకు వాడిన శబ్ద మేమిటి ? 'కద్రూసంభవ' కద్రూ అనే స్త్రీ యొక్క సంతానము అని సర్పంలో ఉన్న విషదంశనాన్ని చెప్పడానికి సర్పపర్యాయపదాల్లో ఏది వాడినా కథన తీవ్రత వచ్చేది. కద్రూపుత్రులు అని వాడటంలో కద్రూవాత్సల్యంవచ్చి చెప్పదలచు కున్న శుగ్గాఢత్వాన్ని పలుచన చేస్తుంది. అసలు ఇక్కడ ఇంత వ్యుత్పత్తి సాధ్యమైన, ఐతిహ్య కఠినమైన పదం వాడి అర్థవ్యాఘాతం కలుగచేసుకొవి ఇరుకున పడటం దేనికి? కాని ప్రాస యిబ్బంది, పాండిత్య ప్రదర్శనాసక్తి. మరి ఏంచేద్దాం ? ఈయన వాస్తవికానికి దగ్గరలో ఉండే పోలికలు తీసుకోక ఎందుకు అంత మారుమూలలకు వెళ్ళి కుస్తీచేయడం ?

ఇలాంటిదే ఇంకొక ఉదాహరణ. దశరథుడు సుమంత్రునితో ఆతని ప్రభుభక్తిపరాయణత్వాన్ని పొగడుతూ ఇలా అంటున్నాడు 'నీవయ్యమరాపగం బలె మహాప్రభు బుద్ధివి!' దేవనదివోలె నీవు ప్రభుబుద్ధివి అని చెప్పినాడు. ఇందులో ముందు లింగైక్యతలేదు. దేవనది స్త్రీ. సుమంత్రుడు పురుషుడు. పోనీ అధునిక మహాకవులు లింగాభేదమైన గుణసందర్శనం చేయగలరని సమాధానపడినా దేవనదికి స్వామిభక్తిపరాయణగా ఎక్కడా ప్రసిద్ధిలేదు. సామ్యం ప్రసిద్ధగుణంమీద ఆధారపడి ఉంటుంది. దీన్ని తెలుసుకోవాలంటే దేవనదికి సంబంధించిన కట్టుకథలు తిరగెయ్యాలి. ఒకటి విష్ణుపాదోద్భవగంగ విష్ణువు మీద ఈ మెకున్న ప్రభుభక్తియా! లేక ప్రభుభక్తి అంటే పతిభక్తి అని చెప్పుకొని శివుని జటల్లో విడక ఉంటుంది కాబట్టి ఆ ప్రభుబుద్ధియా? ఇదైతే దశరథ సుమంత్రుల సంబంధానికి అతుకువడదు. పోనీ భగీరథుణ్ణి వెన్నంటి వచ్చింది కాబట్టి ఆ ప్రభుబుద్ధియా? ఇంకా పురాణగాథ లున్నాయేమో తిరగెయ్యాలి. ఇంకో దేవనది ఏదైనా ఉందా? ఏమైనా దేవనదికి ప్రభుబుద్ధిత ప్రసిద్ధగుణం కాదనే చెప్పవలసి వస్తుంది. మరి కవి ఈ సాదృశ్యం ఎందుకు తెచ్చుకున్నాడు? దీనికి సమాధానం ఉంది. కవి అంతరాత్మలో గంగానది అంటే ఒక సనాతనమైన రూఢవిశ్వాసం ఉంది. అది పెల్లుబుకివచ్చి ఈ శబ్దాన్ని ఇక్కడ గిరాటు వేయించింది.

ఈయన ఒక్కొకచోట తన భాషాపాటవంతో పాఠకుణ్ణి 'ఒహో' అని పిస్తాడు. శబ్దానికీ శబ్దానికీ మధ్యకాదు, అక్షరానికీ అక్షరానికీ మధ్య ఈయన చేసే చమత్కారాలు వర్ణనాతీతాలు. రాజుమాటలకు విశ్వామిత్రుడు సంతోషం పట్టలేక ఇలా అంటున్నాడు. "మఘవజ్జగదవన కళాఽజఘన్యతకు, నీ యుదాత్త సంపదకు దగున్." దశరథుని గొప్పతనమేమిటి అంటే మఘవజ్జగదవన కళాఽజఘన్యత అట! జగత్తును రక్షించుట అనే కళలోని అనీచత అని దీనిఅర్థం. అజఘన్యత ఇదీ అక్షుద్రప్రయోగం వంటిదే. కాని ఈ మహాకవి ఇక్కడ ఒక ట్రిక్కు కూడా చేశాడు. కళాజఘన్యత అని చెప్పివేస్తే దాంట్లో ఉన్న అకారం కనిపించకపోవచ్చు. అప్పుడు నీచత్వమే రావచ్చు. గొంతులోని కోర్కె గొంతులోనే ఉండి చాలా అనర్థం కలుగుతుంది. అందువల్ల కళాఽజఘన్యత మధ్య ఽగుర్తు వేసి చేత్తో మరీ నొక్కి చూపించాడు. దశరథుని జగదవనకళా జఘన్యత ఎలా ఉన్నా వీరి కవన కళా జఘన్యత మాత్రం స్పష్టపడింది. మొత్తంమీద రామాయణం లాంటి మహాకావ్యం వ్రాసే కవి ఇలా పిల్లకవులు చేసే చిలిపిపనులు

చేయగూడదు. అసలు అక్షుద్రుడు అజఘన్యతలాంటి పదాలు వాడి దశరథుణ్ణే ఈ కవి ఎందుకు హింసించుతున్నాడో. హృదయం విప్పి ఆయన్ను పొగడటానికి ఇష్టంలేదు సరిగదా ఆయన్ను ముఖాముఖ సరైన అర్థంలో హీనపర్చడానికి సాహసంకూడా లేక ఇలాంటి శబ్ద చమత్కారాలతోనూ, శ్లేషలతోనూ గొంతు పిసుకుతున్నాడు.

ఈ కావ్యములో అన్వయమునకు సంబంధించిన దోషములు కూడా పెక్కులున్నవి. "ఎవ్వరి కాలిగోటికి సహింపరు సామ్యము లాతుసాంగనల్" అనేచోట ఈకురాలు ...దానికి సహింపరు అని "కోపము రాదు నవ్వునోన గూడదు" నవ్వును ఒలకబోయుటలో విరియ బూయించుటకో బదులు ఒనగూడుట లాంటివి వాడి నుడికారాన్ని హింసించడం. "ఇది పొత్తుకల భార్య నడికట్టుతో వచ్చి" అనేచోట 'ఇడికొని' అని ఆత్మనేపదిని వేయలేక పోవడం, "చంకను నిటికి యింద్రతనయుడు" అనేచోట 'ఇటికి' లో సకర్మకము వాడి అన్వయాన్ని సుస్పష్టం చేయలేకపోవడం, "వెడలుచుండు నాకు వేయియు రెండు కన్నీటి బొట్లు నిముసనిముసమునకు" అని సామాన్యకథనంతో సరిపోయేచోట 'వేయి రెండు కన్నీటిబొట్లు'తో అనవసరంగా విశేషకథనం చేయడం, "సడలెను జిలుతిండి బలిసె జనపతిసతులన్" అన్నచోట నిర్దిష్టమైన కారకాన్ని ప్రయోగించ లేకపోవడం. "యాజ్ఞికుండవు నిదాశోకంబు" అని అర్థంలేని ద్రుతాంతాలు చేయడం" మొదలైనవి ఎన్నో ఉన్నాయి.

ఈరకములైన దోషాలను నేను ఎక్కువ చూపించదలచుకోలేదు. కారణ మేమంటే లోగడ భారతిలో ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులుగారి ద్వారానూ ప్రతి విమర్శచేసిన పావకిద్వారానూ పీటిమీద చాలా చర్చజరిగింది. ఆ అంశములనే తిరిగి నేను చేపట్టిన చర్విత చర్వణమే కాగలదు. ఆ చర్చలమీద నాకుతోచిన కొన్ని అభిప్రాయములను మాత్రమే వివరించి ఈ వ్యాసమును ముగింతును. ఇది గతార్థమైననూ కొంచెము చెప్పకతప్పదు. దీనివలన నాపని యించుక సుకరమగుటయేగాక పాఠకునకు వాస్తవికదృష్టి ఏర్పడుట కొంకింత విలుకలుగును. వేదాంతాచార్యులవారి విమర్శనము సహృదయ పండితుని విమర్శనమువలె చాల సరసముగనున్నది. ఒక అస్వాభావికమైన కావ్యములోని కవిశోభను వ్యక్తీకరించిన ఆవ్యాసము చాల అమూల్యమని చెప్పక తప్పదు. ఒకపండిత పాఠకునివలె సరసవిమర్శకునివలె యాథార్థ్యము గ్రహింపవలెనను నాసయేగాని ఆయన దోషారోపణలలో ద్వేషవైషమ్యములులేవు. విశ్వనాథ

కావ్యములోని కావ్యాత్మ గ్రహింపవలయునని చాల ప్రయత్నించియు తుదకు అది లేమి పిసిగివేసారి ఈపంక్తులు వెలువరించినారు.

"అన్నియయూ నిర్జీవములే. తుదకు గథాకథనముగూడ నెంతమాత్రముఁ దృప్తికరముగాలేదు. ఇందులో పురాణ ధురీణతయులేదు. ప్రబంధ నిబంధనము లేదు....విశ్వాసహీనమైన ప్రాచీనానుసరణ నిర్బంధమే పొడసూపునుగాని వాగరికతావిశిష్ట నవ్యమార్గ విహరణము గానరాడు......ముత్యములవంటిపదము లెన్నో భాషలో నింపారియున్నవి. ఈ రచయిత కవేపియుఁ బొడగట్టవు మృదు శబ్దములకేగాక కఠినశబ్దములకును భాషలో నవకాశముగలదని యెఱుప్పనగ వచ్చును. రసౌచితినిఁబట్టి యాయాపదములు తగుచోట్ల ప్రయోగింపబడెనేని యాక్షేపణయుండదు. తెనుఁగుఁ బద్యమునకు వలసిన విసుకు, నాదము నీ పద్యములందుఁ గానరాదు. మాధుర్యము మచ్చుకైనను లేదు. కవిత్వమున కవసరమైన యుద్రేక మసలే లేదు."

ఇలా వారు విశ్వనాథకవికున్న అవలక్షణము లన్నియు ముక్తకంఠముగా చాటినారు. ఈ మాటలనుబట్టి ఈయన ఎంత సహృదయుడో వ్యక్తమవుతున్నది. ఈ స్థితి ముప్పది పద్యములవరకే కాదు. కావ్యమంతయు నిట్లే యుండునని పపాఠకుడైనను గ్రహించవచ్చును. కాని దీనిమీద 'పావకి' చేసిన ప్రతివిమర్శ చాల అసంగతముగానున్నది. కొన్ని సమాసములకు విగ్రహములు చూపుట, ఆయనకు విగ్రహజ్ఞానము లేదనుట, వ్యాకరణమునుండి కొన్ని సూత్రములు ఏకరువుపెట్టి ఆయనకు వ్యాకరణజ్ఞానములేదనుట, ఏవోకొన్ని ప్రాచీనప్రయోగము లెత్తిచూపి ఆ ప్రయోగపరిచయము లేదనుట మొదలైన అధిక్షేపణలతోనే పావకి తృప్తిపడినారు. కావ్యచర్చ శాస్త్రచర్చవంటిది కాదని ముందు పావకి గుర్తించుకొనునుగాక. అదేమిఖర్మమోగాని విశ్వనాథకునూ వారి అనుయాయులకును ఏతద్విశ్వమంతయూ విగ్రహమయము, వ్యాకరణ మయముగనే భాసించుచున్నది. కావ్యమున కొన్నిశబ్దముల మొత్తమనియు, కొన్ని వాక్యములగుంపు అనియు, అవి పదవిచ్ఛేదములచేత విడదీసి కలుపుటకు వీలుగా నుండవలయుననియూ, తెలియనిచోటుల శబ్దరత్నాకరాదులు చూచి సరిపెట్టుకొనవలయుననియు, ఇదితప్ప కావ్యమున వేరలేదనియూ వీరిభావన. వీరు పదములకు స్వారస్యములు లాగుదురు. శబ్దార్థములను విరిచిచూపి చూపరులకు మిరుమిట్లు గొల్పుదురు. ఉక్తిలో మలుపులు, భావములలో కుదుపులు ఏవేవో ఉన్నవని నిరూపింపజూతురు. కాని ఇవన్నియు కావ్యములో ఆత్మ

అనునదిఉన్నతరువాత అతిరిక్తముగా చూపదగినఅందములు. ఒకప్రక్క కవి యొక్క ముఖ్యార్థము నిర్జీవమై పడియున్నది. ఆశయ వివక్షలేదు. రసములో ఔచితిలేదు. కథలో లక్ష్యములేదు. కావ్యమున కుండవలసిన ఊపిరులను వెడలజేసి బాహ్యాలావణ్యములను కూర్చిన ప్రయోజన మేమిటి? ఒకానొక ఝంఝా వాతమువంటి భావావేశము కవిని త్రోసుకపోవుచుండ చేలాంచలములవలె ఈ ఒయ్యారములు వాటంతట అవియే వచ్చుచూ పోవుచుండవలెను. కాని విశ్వనాథలో ఆ మహావేగము లేని కారణమున ఈయన కవిత్వ పుటడుగులు ఎక్కడికక్కడే చిల్లత్రుప్పల చిక్కుకు పోవుచుండును. ఈ విషయమును వ్యక్తీకరించిన ఆచార్యులకు సూటియైన సమాధానము చెప్పజాలక తమకున్న శుష్క పాండిత్యమును ప్రదర్శించి అసలు విషయమును జారవిడిచినారు. ఆచార్యులవారికి 'ప్రసాదగుణము' అని వాడుట కూడ తెలియదట! ప్రసాదగుణము అనిగాని, ప్రసన్నతా గుణము అనిగాని వాడవలయునట. ఆయన ప్రసన్న గుణము అని వాడి తప్పు చేసినాడట. ఇలాంటి తప్పుడు ప్రయోగమునకు కారణము ఆయనకు ధర్మి ధర్మ సంబంధజ్ఞానము కూడ లేకపోవుటయేనట. ఈ విషయములో ధర్మి ధర్మ సంబంధజ్ఞానము ఆచార్యులవారికి లేదో లేక పావకికి లేదో కొంచెము ఆలోచించవలసి యున్నది. ప్రసన్నము ధర్మి అనియు ప్రసన్నత ధర్మమనియు పావకి అభిప్రాయము. కాని ఇది తప్పు. నిజమునకు ప్రసన్నము, ప్రసన్నత రెండునూ ధర్మములే ఇక్కడ ధర్మి వేరొకటి. ప్రసన్నత ధర్మము. ప్రసన్నతా ధర్మమునకు ధర్మి ప్రసన్నతాకము. ప్రసన్నతాకము తిరిగి ప్రసన్నము కాదు. అది ప్రసన్నత కలిగిన ఒక వస్తువై యుండును. ఆ వస్తువు కావ్యము అని అనుకొందము. అనగా కావ్యము ధర్మి యగును. కావ్యముయొక్క సామాన్య ధర్మము కావ్యత్వమై యుండగా విశేష ధర్మము ప్రసన్నత్వమై యుండును. కావ్యత్వము కలిగిన వస్తువే ధర్మి యగును గాని ప్రసన్నత్వము కలిగిన వస్తువు ధర్మికాదు. ధర్మికి అనగా కావ్యమునకు విశేషణ పదమే ప్రసన్న మనునది. ప్రసన్నము అనగానే వివక్ష పూర్తిగాదు. ఎందువలన ననగా అది కేవలము గుణమును సూచించు శబ్దము మాత్రమే. అందువలననే ప్రసన్నము అనుటతోడనే వివక్షా పూర్తి కొరకు ప్రసన్నమగు అనికూడా చెప్పుకొనుచున్నాము. 'అగు' అనునది ధర్మి అయినది. అది కావ్యము కాబట్టి ప్రసన్నమే ధర్మి కాలేదు. ప్రసన్నము విశేషణ పదము, ప్రసన్నత భావవాచకము. ఇట్లు యీ రెంటికీ ఉన్న తేడా

వాచక సంబంధమైనదే కాని తత్వసంబంధమైనది కాదు. ఈ సూక్ష్మవిషయమును పావకి గుర్తించుగాక. ఆచార్యులు వాడిన ప్రసన్న గుణము అను పదమునందు దోష మేమున్నది? లక్షణ గ్రంథములలోని విశిష్టమైన ప్రసాదగుణము యథా లక్షణముగా విశ్వనాథలో ఎలాగూ లభించదు కాబట్టి కనీసము ఈ కావ్య ములో ప్రసన్నమైన గుణమైననూ లేదని చెప్పినారు. పదవిచ్ఛేదపారీణులు ఇలా ఎందుకు చెప్పుకోరు ?

'ఆ నవ్వు చిళ్ళచిళ్ళ లయినది'. అనుకరణ శబ్ద ప్రయోగములు రూఢియై యున్నవని ఆచార్యులు ఆక్షేపించినారు. దీనిక పావకి ధ్వన్యనుకరణము కాదని, ఆచార్యులవారు పొరపాటు పడినారని ఇది శకలార్థములో వాడ బడినదని టలాయించినారు. దీనిని తెలుసుకొనుటకు కొంచెము భాషాజ్ఞాన మవసరమై యున్నది. చిళ్ళ అని వేరుగా ఉండక చిళ్ళపెంకు అని కలసి ఉంటుందని అలా సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఉందని పావకియే చెప్పెను. చిళ్ళ అనునది వేరుగా లేదు. పెంకుతో కలిసి ఉన్నది. ఇది ఆచార్యులవారి వాదమునే బలపరచుచున్నది. పలనన ధ్వన్యనుకరణములకు స్వతంత్ర వ్యక్తిత్వ ముండదు. చిళ్ళ అను శబ్దము ఎట్లేర్పడినది విచారింతము. కొన్ని శబ్దములు ధ్వనినిబట్టి కూడ ఏర్పడుచుండును. 'కా కా' అను దానిని బట్టి కాకి పుట్ట వచ్చును, అలాగే కుండ పగిలినప్పుడు ఛిళ్ళు మనును. అదే చిళ్ళగా అయినది. ఇది ధ్వన్యనుకరణము. ఈ ధ్వన్యనుకరణమునే మన మప్పుడప్పుడు విశేషణ ముగా వాడుచుండుము. పిట్ట తుర్రున పోయింది. ఇది ధ్వన్యనుకరణము. దీనిని తుర్రుపిట్ట అనినయెడల విశేషణమగును తుర్రుపిట్ట, కిర్రుచెప్పు, చిళ్ళ పెంకు ఇవి. పిట్ట తుర్రు తుర్రు లయ్యెను అంటే ఏమన్నా అర్థ ముందా? లేదు. అలాగే నవ్వు చిళ్ళ చిళ్ళలైందన్నా ఏమీ అర్థము రాదు. ఇలా ప్రయోగించితే చేతకాని ధ్వన్యనుకరణము అనగా సంప్రదాయ విరుద్ధమైన ధ్వన్యనుకరణము అనవలసివస్తుంది. ఇది ప్రసిద్ధి త్యాగమనే దోషము. అలా కాక శకలశకలమైందని ఆయన చెప్పుకున్న అర్థాన్నే చెప్పుకుంటే నేయార్థమనే దోష ముంటుంది. ఎందువల్లనంటే ఇచ్చటి లాక్షణిక ప్రయోగము రూఢి, ప్రయోజన ముల ఏ ఒక్కొటి మీదా ఆధారపడి యుండలేదు. ఇలాగే విశ్వామిత్రుని నవ్వు ముసురుతుంది. ఆచార్యులవారికి ఈగలు ముసిరినట్లు అనిపించితే పావకిగారికి చీకట్లుముసిరినట్లనిపించినాయి. ఇది మొదటిదానికంటె ఘోరము. విశ్వామిత్రుని నవ్వు చీకట్లు ముసిరినట్లు ముసరడమేమిటి? పాపము శమించుగాక ! ఆయన

ఆమాట అన్నాడు గాబట్టి దానికి ప్రతిగా ఈయన ఈమాట అన్నాడేగాని మళ్ళీ యీ అర్థాన్ని కలిపి చూచుకోలేదు. కలిపిచూస్తే మళ్ళీ వీరిని ఆనేయార్థమే వెంటాడుతుంది. నవ్వు ముసరడం ఎలాఉంది? నీ ముఖం చంద్రుణ్ణి తన్నింది అన్నట్లు లేదూ ?

"తనూ రోమాంధువు లానంద శ్రీ) మత్పులకాంబుభంగ ధృతి ముని పొంగెన్" ఇక్కడ ఆచార్యులవారు ఎత్తిచూపిన సమాస వ్యత్యయాన్ని తట్టుకోలేక ప్రౌఢ వ్యాకరణంనుండి ఒక సూత్రాన్ని తెచ్చి ఇది ప్రథమకాదు సప్తమి అని పాఠకులకు దిగ్భ్రాంతి గొల్పారు. అంతవరకే. ఈ గడమాయింపు అయినతరువాత మళ్ళీ ఆ అన్వయం వీరుచెప్పిన సప్తమితో ఎలా పొసగుతుందో చూపలేదు. వీరు చెప్పిన సప్తమీ అర్థాన్ని వేసి ఈసారి చూద్దాం. తనూరోమాంధువులంటె వీరి సప్తమిప్రకారం తనూరోమాంధువులందు ఆనంద శ్రీమత్ పులకాంబు భంగధృతిచేత ముని పొంగుతున్నాడట. ఇక్కడ రోమాంధువులు అధికరణము. అంటే ముని రోమకూపాల్లోనే కూర్చుని పొంగుతున్నాడు అని చెప్పవలసి వస్తుంది. ఇది చాలా విపరీతమైన అర్థం. రోమాంధువులందు ఆనందశ్రీ కాకుండా రోమాంధువులందలి ఆనంద(శ్రీ) అని సప్తమిమీద షష్ఠి చేయవలయునని కవిగారి అభిప్రాయము కాని ఈ ప్రయోగంవల్ల అది సిద్ధించదు. అలా అర్థం చెప్పుకోవాలంటె మళ్ళీ ఆచార్యులవారి ఆక్షేపణే ఎదురౌతుంది.

రాముడు నన్నునుగన్న తండ్రి. ఇక్కడ 'ను' గణముకొరకే ఏర్పడినదని ఆచార్యులు అన్నారు. అది నిజము. దీనికి పావకిగారు ఇచ్చిన సమాధానం ఇది. "నాకు స్నానమగు, జపమగు, ధావనముగు, ఎల్లనా బ్రతుకునగు", వెనుక ఇన్ని ఉన్నాయి 'నన్నును' గన్నతండ్రి ఇచ్చట సముచ్చయం ఉండితీరాలి. నిజమే సముచ్చయముండితీరాలి. అది నన్నునువద్ద ఉండితీగాలో కన్నతండ్రివద్ద ఉండితీరాలో కొంచెం యోచనచేయాలి మరి. ఈ పద్యంలో కవియొక్క విధేయాంశం 'నా' అనే సర్వనామము కాదు. స్నానము భోజనము, కన్నతండ్రి మొదలైనవి. పైవన్నియూ ఎవరినో అయితే ఇక్కడ నన్ను అని చెప్పవలసి వచ్చేది. కాని దశరథునకు రాముడు ఏమి అవుతున్నాడు అనే దానికి పై పద్యంలో సమాధానం రావలసి ఉంది. అందువల్ల రాముడు స్నానమయ్యాడు భోజనం అయ్యాడు, తరువాత ఏమి అయ్యాడు ? కన్నతండ్రియును అయ్యాడు. ఇలా నన్ను వద్దకాకుండా కన్నతండ్రివద్ద ఈ 'యును' వేయాలని పావకి గుర్తించవలెను. ఊరికే ఛాంకరించితే లాభంలేదు. అసలు ఈయనకు సముచ్చయాల

మీద ఇంత జాగ్రత్త ఉంచే అత్యవసరముతైన కొన్నిచోట్ల వాటిని అతి ఘోరంగా వదలిపెట్టారే!

"తండ్రి తల్లికిచ్చుఁ దల్లి దానికొసంగు
సంభ్రమించి రిట్లు శాంతయు ముని ౯౯ పేజీ.

ఇక్కడ మునిశబ్దం తోకతెగిన మొండెంలాగా ఉంది. ఒక్క సముచ్చయం వేయగూడదూ! గణం చాల్లేదు. ఇంతకీ ఈ కవికి గణప్రస్తారం ఒక్కొక్కప్పుడు నవారు కొలతలా అలా సాగి మరొకప్పుడు నత్తగుల్లలా ఇలా ఇలా ముడుచుక పోతుందేం?

దైత్యజంతువులు రూపకం కాదు ఉపమితసమాసం అని ఇంకో టలా యింపు. దైత్యులే జంతువులు అని మాత్రం ఎందుకు చెప్పగూడదు. అసలు దైత్యులు హీనులో జంతువులు హీనులో ఆ రెంటికి సామ్యం చెప్పడమేమిటో ఇదంతా ఒకగందరగోళంగాఉంటే దానిమీద రూపకమాఉపమానమాఅని ఇంకో పేచీ దెచ్చి అదంతా మొత్తం గలిపితే పాఠకుడికి ఏమీ తోచక దిక్కులు చూచేంత వికారస్వరూపాలు ఈయన రూపకల్పనలు.

ఇలాగే సుబాహు మారీచ ద్వంద్వాన్ని సాధించడానికి ఇంకొక యుద్ధం. సుబాహుమారీచులన్న ప్రయోగం రఘువంశం, సంగ్రహ రామాయణములందే ఉన్నదట. ఉండవచ్చు అసలు సుబాహుడు ముందా? మారీచుడు ముందా? ఇది చిన్నపిల్లవాడికైనా తెలుస్తుంది. దానికి సంస్కృతంనుంచి ప్రయోగాలు తెచ్చి చూపాలా! ఇప్పుడు మీరు దేంట్లో రాస్తున్నారు? తెలుగులో వ్రాస్తున్నారు. మీరు ఎత్తిచూపిన ప్రయోగం దేంట్లోది? సంస్కృతంలోది? ఎన్ని సంవత్సరాల నాటిది. దాదాపు వెయ్యిసంవత్సరాలనాటిది. ఒక వెయ్యి సంవత్సరాలనాడు ఒకభాషలో (సంస్కృతంలో) ఒకమైత్రితో ఉన్న శబ్దాలు వెయ్యి సంవత్సరాల వెనుక వేరొకభాషలో (తెలుగులో) అదేమైత్రిలో ఉంటాయా? వ్రాసేది తెలుగు రామాయణం, 20వ శతాబ్దిలో. ప్రయోగాలు ఎత్తిచూపించేది సంస్కృతంలో కొన్నివందల సంవత్సరాలనాటివి. ఎంత అమాయికం? సరససాహిత్యస్రష్టకు సుబాహుమారీచుసు అని వాడాలో మారీచసుబాహువులు అని వాడాలో హృదయానికి తగులుతూనే ఉంటుంది. ఈవిషయాలన్ని చర్చించేవిగావు. రసజ్ఞ పాఠకులు స్వయం నిర్ణయించుకునేవి.

ఇక్లే వీరు ప్రతిసమాసమునకు విగ్రహము చూపి ఇది మంచి సమాసమే అని తృప్తిపొందుటకూడ వ్యర్థవిషయము. విగ్రహము చెప్పుటతోడనే ఒకవికృత

సమాసమునకు ఔచిత్యము సిద్ధించదు. విగ్రహము ఏమిటి? అదొక తంతు. తిరిగి సంస్కృతములో విడదీసి చెప్పుట. "నవబాహాపటుదీర్ఘదండుడు" లాంటి సమాసములోని వ్యుత్క్రమము ఏకొంచెం సమాసం తెలిసినవానికైనా కటువుగానే ఉంటుంది. మహాకవుల సమాసయోజన తలకొక తీరుగా ఉండవచ్చును. కాని కట్టుబాటులు తొలగించకయే వారు తమ సమాసములలో తమవ్యక్తిత్వము లను నిరూపించుకొందురు. ఈకవి కట్టుబాటును తొలగించివేయుటవలన సమాసము విన నలవాటుపడిన చెవికి అది ముల్లుగా గ్రుచ్చుకొనును. సమాసము లోని మంచిచెడులను చెవియే చెప్పగలదు. విగ్రహముచేసి చూపిన మాత్రాన సమాధానము కుదురదు. ఆచార్యులవారు చేసిన ప్రతిఆక్షేపణకు వీరుచెప్పినసమాధానము గురికి మూరెడు అటునిటుగా జారిపోయినది ఇంతకంటే ఈవిషయాన్ని ఇక పొడిగించి చెప్పనవసరము లేదు. ఒక్క వేదాంతాచార్యులు వారే కాదు, ఎవరైనా విశ్వనాథ వారి పద్యాలకు అర్థాలు చెప్పలేరు. ఇది పాఠకుల తప్పుగాదు. వారి పద్యమే అలాంటిది. పద్యం ఎక్కడికక్కడకు విరిగిపోతుంది. సమాసం గానీ, శబ్దంగానీ, భావంగానీ ఏదీ చేతికిరాదు. అసలు మంచి పద్యం అనేది పాఠకుణ్ణి దానంత అదే లాక్కుపోవాలి. ఆశక్తి ఈయనపఏవొక్క పద్యంలోనూ లేదు. కొందరి ఆధునికుల పద్యాలు మేలిమిముద్దలులా ముచ్చట గొలుపుతూ ఉంటాయి. ఈయనపద్యాల్లో ఆమేలిమిఅనేదేలేదు. ఒక వేళ అదిఒకపాలు ఉన్నా వెంటనే దాంతోపాటు సీసం, ఇనుమూ, తుత్తినాగమూ, రాగీ ఎక్కువ పాళ్ళల్లోఉండి అది ఏధాతువో తెలియకుండా పోతుంది. అది ఒక మహాధాతువని కొందరంటారేమో. అననివ్వండి కొన్ని అనలక్షణాలు ఒక తూనిక ప్రకారం కలిస్తేకూడా ఒక వ్యక్తిత్వమవుతుందేమో, ఇప్పుడు అనుమానం కలుగుతుంది. ఆయనేదో ఒకటిఅయ్యాడు. కాని ఆయన్ను అనుసరించేవాళ్ళు మాత్రం చిక్కులో పడతారు. ఎందువలన? మరి ఇన్ని అవలక్షణాలను అనుసరించాలన్నా కష్టమేగదా. వీరిపద్యాలు చాలమంది చదువుతున్నారుగదా! అనవచ్చు. ఎవరు చదువుతున్నారు? పాఠకులు చదవడంలేదు. ఆయన్ను స్తుతించేవారో విమర్శించేవారో చదువుతున్నారు. నేనూ ఈవ్యాసాలతో విమర్శించాను. కాని నేను విమర్శక విమర్శకుణ్ణికాదు. పాఠకవిమర్శకుణ్ణి. పాఠక విమర్శకుడంటే పాఠకుడు చదివినదానిమీదనుంచి విమర్శించుతాడు. విమర్శక విమర్శకుడంటే; విమర్శించడంకోసం విమర్శించుతాడు. అంటే వృత్తివిమర్శకుడన్నమాట. ఈయనలో వ్రాసేకంటే వినిపించేశక్తి ఎక్కువఉంది. వినిపించే

కంటే ఒప్పించే శక్తి వుంది కొన్ని పదుల పుస్తకాలు వ్రాసినప్పుడు కొన్ని వందల పాఠకులైనా ఉంటారు. ఏపుస్తకం చదువరు? డిటెక్టివ్ నవలా చదువుతున్నారు, కాళిదాసు మేఘసందేశమూ చదువుతున్నారు. దేశింగురాజుకథలూ చదువుతున్నారు. ఒక కొంతమంది ఒకకవికి ఎప్పుడూ చదివేవాళ్ళు ఉంటారు. కాని సుపరిష్కృతులైన పాఠకులు ఎలాంటికవిని ఎన్నుకుంటారో, వారికి ఏకవి కావాలో, ఏకవి యుగాన్ని నడిపించగలుగుతాడో, ఏకవి జాగరూకుడో, ఏకవి రసజ్ఞ ఈహృదయాల్లో హత్తుకుంటాడో, ఏకవి పిలుపులో జాతివిద్యుద్ఘాతం పొందినట్లు త్రుళ్ళిపడుతుందో, ఆకవి, ఆమహోన్నతకవిని జాతిఊరికే గుర్తించుకుంటుది. ఈస్తుతి సాహిత్యంలో పారు ఎంతపోతుందో మన యీ ఏదో వ్రాసేవాళ్ళకంటే ప్రజలకే ఎక్కువతెలుస్తుంది. విశ్వనాథవారు వారికున్న భక్తిచొప్పునా శక్తిచొప్పునా ఏది వ్రాసుకుంటే ఎవరుకాదంటారు? కాని యుగాన్నిమాత్రం ఉ..్వంచవద్దని నామనవి.

---

## అభిప్రాయ వేదిక

ప్రతివిమర్శకులు అసలువిషయంమీదకు రావడంలేదు. నా 'పేరు' ను మాత్రం తారుమారు చేస్తున్నారు. దురదృష్టం. "ఆ విమర్శ అట్లుంచి కొన్ని సామాన్య విషయములు" అనీ "ఈ విమర్శకు సమాధానం వ్రాయుట నా ఉద్దేశ్యం కాదనీ", "విమర్శ ఎట్లున్నప్పటికీ దక్షిణభారత సభ" అనీ సభనూ, పత్రికనూ, బెదిరించుతూ అయినవారినీ కానివారినీ కూడ నిగ్గదీస్తున్నారు. ఇది మరీ దురదృష్టం. హిందూ మతాన్నికూడా కాపురలకు తెచ్చుకుంటున్నారు. ఇది ఇంకా ఇంకా దురదృష్టం. ప్రతివిమర్శకుల వాదపద్ధతి మనకు తెలిసిందే, కొత్తగాదు. ముందు శబ్దాలూ, అర్థాలూ తెలియవు అనడంతో ప్రారంభించి, వ్రాయుటకు గల అనధికారాన్ని నిరూపించి, ముందు అది తెలుసుకున్న తరువాత దీనికి దిగాలి అని సాధికారంగా శాసించడం. ఈ 'తెలియదు' అన్న మాటను ప్రతిచోటా ప్రతి మనిషికీ ఉపయోగించితే ఆ అనడం అర్థం లేకుండా పోయి చివరకు అలా అనడమే ఒక పిచ్చిగానో, జబ్బుగానో తయారవుతుంది.

రామాయణ కల్పవృక్షం విమర్శమీద ప్రతివిమర్శ చేసినవారు ఇద్దరో, ముగ్గురో ఉన్నారు. వీరికి అంత పెద్ద వ్యాసంలోనూ రెండేరెండు విషయాలు దొరికినాయి. ఇంకా విచిత్ర మేమంటే అందరికీ దొరికినవి ఆ రెండు విషయాలే. ఇది అద్వైతం కాదు రూపకాలంకారం అని ఇద్దరు ఒకే పెట్టున గదమాయించారు. బాగుంది. అద్వైతం అయితే రూపకాలంకారం కాగూడదని ఎక్కడుంది? ఇతడు పోలీసు, మనిషి కాదన్నాడట ఒకాయన. పోలీసు పోలీసూ అవుతాడు, మనిషీ అవుతాడు అన్నాడట రెండో ఆయన. ఈ సంబంధాలు కొంచెం అర్థం చేసుకొని మాట్లాడాలి మరి. ఒట్టి బూకరింపు పనికిరాదు. అక్కడ ఉంది రూపకాలంకారమైతే అది దేనికి తొడిగారో అది అద్వైతమే అవుతుంది. అద్వైతపరంగా మాత్రం అలంకారాన్ని వేసుకోగూడదూ? దీంట్లో ఉన్న అలంకారం రూపకమైతే అలంకార్యం అద్వైతం. వీటిని ఆలోచించేటప్పుడు కాసింత అలంకార అలంకార్య జ్ఞానముండాలి. వేదాంతం దీంట్లో లేదని మీరు చెప్పనక్కర్లేదు. అది నేనే చెప్పివేశాను. కాగా పోగా 'జీవి' 'మాయ' లాంటి అనవసరమైన బులాకీలు అక్కడ తగిలించవద్దంటున్నాను. ఇంకొకటి అసలిక్కడ రూపకాలంకారం కూడా లేదు. లేనిపోని ఇంకో తప్పును మీద వేసుకున్నారు ఈ ప్రతివిమర్శకులు. ప్రియసుతుడన్న జాబిల్లి, కొడుకన్న చిన్నారిపడవ అన్న పై నాలుగు సీసపాదాల్లో రూపకం ఉంటే ఉందేమో కాని ఆ ఆట వెలదిలో మాత్రం లేదు. కవిత్వం వ్రాసేవాళ్ళకు తెలుస్తుంది ఒక భావం సీసపాదాల్లో ఒక తీరుగా నడిచి క్రింద ఉన్న గీతం, ఆట వెలదుల్లో ఇంకో నడక నడుస్తుంది. పైన లక్ష్యాలు ఉంటే క్రిందలక్షణం ఉండటమో, పైన విశేషంఉంటే క్రింద సామాన్యం ఉండటమో ఏదో ఒకటి. ఈ కవికూడా పైపద్యంలో అలా గేచేశారు. పైనరూపకాలు చెప్పుకుంటూవచ్చి క్రింద'తనయుడన్న సూక్ష్మతత్వం బెఱుంగని జీవిమాయలోన జిక్కుకొన్న యనదపుర్వు'అని ఒకసిద్ధాంతం చెప్పారు. ఇది సిద్ధాంతవాక్యం పైవిఅలంకారవాక్యాలు. సొగసున్నఊహే అలంకారమౌతుంది. అన్నిఊహాలూ అన్నివాక్యాలూ అలంకారాలుకావు. పంచభూతాత్మకమైనది ఈజగత్తు అంటే సిద్ధాంతమవుతుందికాని అలంకారంకాదు. ప్రతివిమర్శకులు గ్రహించాలి.

నేను ఎక్కడో ఉపమఉందనీ రూపకముందనీ అన్నానట. నేను ఎక్కడా అనలేదు. ఫలానాపద్యంలో ఉపమ ఉందనిగానీ రూపకముందనిగానీ లేదు. 'పోలిక' అనే పదంవాడాను. అది ఉపమ అనుకున్నారేమో పాపం. ఉపమా సామగ్రిని సంస్కరించుకోవాలి అన్నాను. దాన్నికూడా ఉపమాలంకారం

అనుకుంటే ఇక మనం చేసేదేముంది ? "ఒనరబోర్కాడించియుయ్యెలతొట్టెలో బండపెట్టిన పసిపాపవోలె" అనేపద్యంలో సాధారణీకరణలోపం చూపించాను. ఆ సాధారణీకరణలోపం చూపించడానికి ఆ సీసపద్యంలోని ఆ నాలుగుపాదాలే చాలు నాకు. ఆ పద్యం ఏస్థానంలో ఉందో చెప్పడం అక్కడ నా లక్ష్యంకాదు. ఏపద్యమూ ఏ స్థానములోనూ లేదని కథాసంవిధానంలో చూపించానుగదా. ఏవస్తువును ఏదీపంక్రింద వెదకాలో నాకు బాగాతెలుసు. ఎక్కడ ఏది పారవేసుకున్నారో తెలియనివాళ్ళ వస్తువునుకూడ ఒక దీపంవద్దకుతెచ్చి సరిచూడడము కూడా నాకుతెలుసు. మీరు కళ్యాణఖండం చదవమని సలహాచెప్పారు. అదినేను చదివితే అక్కడ మీరు చెప్పినగుణాలు లేకపోగా ఇంకాకొన్ని కొత్తదుర్గుణాలు కూడా బయటపడవచ్చు. అందువల్ల చదవను.

కొంచెం జయంతి సంపాదకీయం చూద్దాం. అందులో ఒక వాక్యం 'వ్యాఖ్యానించినచో మరియు యే యితర కాలమునందు' ఇక్కడ యడాగమం ఉంది. ఈ సంచికలోనే అభిజ్ఞాన శాకుంతలంలో 'వ్రాయదగిన వెన్నియో నున్నవి' ఇక్కడనుగాగమముంది—ఏమిటీ బదులుకోళ్లు? 'ఇంద్రుడడిగినట్లు మొదలైన కథయున్నది' ఏమిటీకథ ? ఏమి భాష! ఇక విషయంమీదకు వద్దాం. సంపాదకీయం చాలావిషయాలమీద వలిదిరిగింది. ఈ వలిదిరగడంలో ఏమి చెప్పబోయి ఏమిచెపుతున్నారో సంపాదకీయులకే అర్థంకావడంలేదు. ఏదైనా చెప్పదలచుకుంటే రెండు పద్ధతులుంటాయి. ఒకటి- శాస్త్రీయపద్ధతి రెండు- కావ్యపద్ధతి. తర్కం ఈ శాస్త్రీయపద్ధతికి కొంతవరకు ఉపయోగిస్తుంది. అంతే గాని తర్కమే అంతాచేసిపెట్టదు. తర్కంతోనే ఉన్నదిలేనట్టు లేనిదిఉన్నట్టు చెప్పలేము. ఉన్నదేదో ఉంటుంది. లేనిదేదో లేదు. మన పూర్వీకులు తార్కికులు ఈశ్వర తత్వాన్ని సులభంగా శాస్త్రీయపద్ధతిలో తెలుసుకోవడానికి ఈ తర్కశాస్త్రాన్ని పెంపొందించారు. తర్కం ఇలాసాధనమాత్రమే అని తెలుసుకోనివారు తర్కంతోనే అన్ని సాధించివేయాలని చూస్తుంటారు. ఇట్టివారు తర్క సంగ్రహంవరకే చదివి ఆపైని తర్క ప్రయోజనమేమిటో తెలియక కేవలం పాండిత్య ప్రదర్శనంకోసం దానిలోని నాలుగుమాటలను వాడి లేక ఆశైలిని వాడి పాఠకులకళ్లు జిగేలుమనిపిస్తారు. ఆ ధోరణి ఈసంపాదకీయంలో నడుస్తుంది.

"గొప్ప కవియని అనుకొనబడుచున్నవాడొకడు కలడు. వాని సిద్ధాంతములు మనకిష్టము కావు. వానిని మనము గొప్పకవి యనుచున్నాము.

ప్రతిభాశాలి యనుచున్నాము. వాని కావ్యమునం దవి లే విని లేవని వ్రాయు చున్నాము. అనగా మనమనుకొన్నవి లేవనియేకదా! అవి లేకపోయినను వాడు గొప్ప కవియని మనమంగీకరించు చున్నాముకదా—వాడు కవి. నీ సిద్ధాంతములు లేవు. అనగా కవిత్వమునకు సిద్ధాంతమునకు సంబంధము లేదనియేకదా అర్థము."

కుక్క చెప్పు కొరికెను. కుక్క కానిది చెప్పు కొరకదు. కొరకబడుట దేనికి ఉన్నదో అది చెప్పు. కొరకబడుట లేనిది చెప్పు కాదు. చెప్పుగానిది కుక్క కొరకదు. అనగా కుక్క చెప్పును కొరకలేదని ఓనియర్థము. ఇదే మూదిరితర్కం. ఈతర్కాలవల్ల ప్రయోజనం లేదు. గజం మిథ్య పలాయనం మిథ్య లాంటివి. కాకపోతే సిద్ధాంతాలు లేకపోతే కవి అవడమేమిటి? ప్రతిదీ వాదంకోసం ఒక బండగీటు గీసుకొని కొమ్ములున్నవన్నీ ఎద్దు, కొమ్ములులేనివన్నీ గుఱ్ఱాలు అన్నట్టు విషయనిర్ణయం చేయగూడదు. పిల్లల కవిత్వంలో సిద్ధాంతాలు లేకపోవచ్చు. ప్రణయ కవిత్వంలోనూ దాదాపు సిద్ధాంతాలు రాకపోవచ్చు. కొంచెం గంభీరంగా వ్రాసే కవిలోమాత్రం సిద్ధాంతాలు ప్రత్యక్షంగా కాక పోయినా పరోక్షంగా సూక్ష్మంగానైనా ఉంటాయి. ప్రతికవి వెనుకా కొన్ని అభిరుచులూ, సిద్ధాంతాలూ ఉండి అతని శైలిమీదా, శబ్దసంకలనం మీదా, అతని కావ్యవస్తువు ఎన్నికమీదా ప్రభావం చూపుతూంటాయి. అసలు వెనుకటి కాలానికి ఇప్పటి కాలానికీ చాలా తేడా ఉంది. వెనక సిద్ధాంతకర్తలు వేరు, కవులు వేరు. ఆయా సిద్ధాంతాలూ, శాస్త్రాలు ఆయా వర్గాలవరకే పరిమితమై ఉండేవి. కాని ఇప్పుడు కవి సిద్ధాంతకర్త కూడా అవవలసి వచ్చింది. కవేకాదు ప్రతి సామాన్యుడూ ఇప్పుడు కొన్నివిషయాలు తనకుతానై చర్చించవలసిన అవసరం వచ్చింది పూర్వం ఒకరు చర్చించియిచ్చిన విషయాలు కవులు కళ్ళు మూసుకొని చెప్పేసేవారు. ఇప్పుడు తనకై తాను కళ్ళుతెరిచి చూడవలసి వస్తుంది. చర్చించవలసీ వస్తుంది. ఈ చర్చించవలసి రావడమనే పరిస్థితినే సిద్ధాంత మంటాము. ఈ స్థితి ఎందుకు వచ్చిందంటే ఏ అభిప్రాయమూ ఇప్పుడు వ్యక్తి పరంగా లేదు. అన్నీ సమాజపరమై కూర్చున్నాయి. ఈ సూక్ష్మ భేదాన్ని తెలుసుకుంటేనే ఏది కవిత్వమో తేలుతుంది. కవిత్వమంటే వాగ్వైచిత్రి వ్యంగ్యవైభవము, వక్రోక్తినైపుణ్యమూ వీని నాశ్రయించి ఉండటం అలా ఉంచి ఇవి దేనిని ఆశ్రయించి ఉంటాయో అది ఒకటుంది. అది ఒక వస్తువో,

రూపమో, భావమో అయి ఉంటుంది. ఆ వస్తు రూప భావాలు ఏ దృష్టితో చెప్పబడుతున్నవో అదే సిద్ధాంతం. ఇది కవిలో కనిపించకుండానూ కనపడుతూనూ ఉంటుంది. ప్రతి మహాకవి వెనుకా ఈ దృష్టికోణం ఉంది.

నే వాడిన శబ్దం ఆ అర్థంతో అర్థం కావడములేదని ఇంకో ఆక్షేపణ. ప్రాత సత్యం అన్నానట. నిజమే. ప్రాత క్రొత్త సత్యాలు ఉంటాయి. సత్యం అనాదిసిద్ధమైంది అని మీరు రోకటిపాటగా చదువుకున్నారు. సత్యంటే జీవిత సారాంశం. అందువల్లే జీవితాన్ని ఉపయోగించుకోగా మిగిలిన మిగులును సత్యమని చెప్పాను. కరుగుతున్న జీవితంతోపాటు కరగని కొన్ని శాశ్వత ధారణలు మనకు ఏర్పడుతూ ఉంటాయి. ఇవి కొంతకాలం వరకూ కరగవు. కాని జీవితం విలువల్ని తల్లక్రిందులుచేసే అంత తుపాను వచ్చినప్పుడు ఆ శాశ్వతధారణలు కూడా మారిపోతాయి. అహింస, బ్రహ్మచర్యం, అస్తేయం ఇవి ఒక రకంగా సత్యాలు అంటున్నాము. పరుల సొమ్ము ఏ విధంగా పొంగిలించినా అది దొంగతనమే. కాని అస్తేయం ఆ అర్థంలోనే ఇప్పుడు లేదు. ప్రాచీన-అస్తేయం ప్రకారం దొర అయినవాడు ఇప్పుడు దొంగ అవుతున్నాడు. దీన్ని మారటం గాక మరేమంటారు? అదిగాదు. ఆ అహింసా, అస్తేయం, అనే వాటిల్లో ఉన్న సామాన్యగుణం. అది సత్యం. అది ఎప్పుడూ ఉంటుంది అన్నా 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అనే ముక్తిదశలో అది కూడా లేకుండా పోతుంది. అందువల్ల అన్నీ అర్ధ సత్యాలే. ఇవి తాత్విక విషయాలు. కేవల నిఘంటు గతజ్ఞానులకు ఈ విషయాలు ఎలా తెలుస్తాయి? నిఘంటువులో శబ్దమూ దానికున్న అర్థమే తెలుస్తుంది. శబ్దార్థజ్ఞాన మెంత ఉన్నా విషయజ్ఞానం లేకపోతే ఆ విషయం తెలియదు.

నేను పేరుకోసం ఈ విమర్శ వ్రాస్తున్నానని ఇంకో వెక్కిరింపు. విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షం వ్రాస్తే అది జీవుని వేదన ఎందు కవాలి, నేను ఆయనమీద విమర్శ వ్రాస్తే జీవుని వేదన ఎందుకు కాకపోవాలి? అసలు ఆయన జీవుడుకంటే నా జీవుడే మంచివాడేమో. పిరికితనానికీ సాహసానికీ తేడా కొద్దిలోనేఉంటుంది. గెలుపుకూ ఓటమికీకూడ తేడా కొద్దిలోనేఉంటుంది. అలాగే పేరుకోసం చేసే ప్రయత్నంలోనూ పేరుచూడకుండా చేసే ప్రయత్నంలోనూ కూడా తేడా కొద్దిదే. పేరువచ్చినా రాకపోయినా అది ఒక ప్రయత్నం. పేరుకోసం ఉబలాటపడుతున్న ఈలేత విమర్శకులూ, రచయితలూ తమ ఉబలా

టాన్ని అన్యులమీద ఆరోపించి ఆనందిస్తుంటారు. అసలు ఒకరిమీద విమర్శలు వ్రాస్తే పేరు వస్తుంది అనుకోవడం అవివేకం. వెనుక విమర్శలు వ్రాస్తే పేరువచ్చినమాట నిజమేగాని ఇప్పుడు తెలివైనవారు ఇంకో సులభమైన కొత్తమార్గం కనిపెట్టారు. అది స్తుతిమార్గం. అదేపనిగా ఒకరిని స్తోత్రంచేస్తుంటే కొంతకాలానికి పేరురావచ్చు. హుందాగా ఒకస్థాయిలో స్తుతించడంకూడా కొంతకష్టమైనపనే అనుకోండి. కాని విమర్శించడం పరమకష్టమైన పని.





# వాన వెలిసింది

—శ్రీ పెండ్యాల వరవరరావు

చైత్రరథమ్మెక్కి రవి
జైత్రయాత్ర వెడలినాడు
వ్యాకోచముచెంది గీఱ
లాకసాన వ్రాడిపడియె

మార్తాండ మహితతేజమ్మును
మబ్బు దుబ్బ గప్పుకొనియె.
నల్లరేగడి చరియలట్టు
లల్లుకొనె మేఘమ్మ లెల్లడ
ఆకసము అంబోతు
పోలిక రంకెవేసెను.
విహాయసపు గుహాలోపల
విహరించెడి కేసరి విధమ్మ
గర్జించెను పర్జన్యుడు.

అబ్ధి అంతరాంతరాల్లో
మబ్బుముంత ముంచి చేది
సాయంగృహిణి వాకిట
చానిపి చల్లిన చందము
ప్రకృతి పచ్చందనాల
ఆకృతిదాల్చెను యెల్లెడ.

సుడిగాడుపు కెగిరిపోయి
ఉడువీథిని చిక్కినట్టి
ప్రకృతి చేలాంచలమ్ము
పగిది దోచె నింద్రధనువు.

ఆకాశపు టందగత్తె
ఆనందాశ్రువులట్టుల
గగన రమణి సిగప్రేలిన
తారకాసుమమ్ములట్లు
వానచినుకు లొలికిపోయి
వసుధ క్రొత్తబదుకుదాల్చె.

ఆవిరియై ఎగసినట్టి
ఆశ పునర్జీవమెత్తె
గతము గాలి కెగసి ప్ర
స్తుత పర్వతమును దాకి
భావి హరిత రూపమెత్తె.

బీదవాని హృదయంలో
ఉదయరేఖ మెదిలినట్లు
తూరుపు దిక్కున చక్కని
మెరుపు తళుక్కున దరిసెను.

నింగి శృంగమందు నిలిచి
నెచ్చెలి స్మితవదనయయ్యె
కాంతిరేఖ గీసి నవ
క్రాంతివార్త నందించెను.

అనుభూతులలోకంలో
అనురాగం అందించిన
చినుకుల చిన్మయమూర్తి
క్షణంలోన చాటయ్యేను.

ప్రత్తిచెట్టు పూసినట్టు
పవిత్రత దాల్చెను మబ్బులు.

పావన గగన సరస్సున
ధవళాంబుజమ్ము మాడ్కి
వెన్నెల రెక్కల విచ్చుక
పున్నమి చంద్రుడు పూచెను.

తరగలు తరగలుగ నీరు
పొరలి కప్పివేయునట్లు
మబ్బు తెరల మేలిముసుగు
మాటున శశి సిగ్గుచెందె
నేడు బీదరైతు యింట
వేడుక పండుగ జరుగును.

పున్నమి చంద్రుడు సిగ్గుతొ వెన్నెల ముగ్గులువేయును
రజనీకాంతుడు శారదారజస్సుతోడ జీవించును.

## కబీరు సూక్తులు

'ఎవడు నిజము నమ్మ డిది యేమి కర్మమో
కల్ల యన్న లోకమెల్ల నమ్ము
కాలు కదలకుండ కల్లమ్మడై పోవు
గోరసమ్ము గొంది గొంది తిరుగు.'

'నీటి బుడగ జాతి నిజమురా మనజాతి
ఇట్టె ఆరిపోదు మెపుడొ మనము
ప్రొద్దు పొడుపు కెట్లు పోవురా చుక్కలు
మినుకు మినుకు మనుచు మెఱసి రాత్రి ?'

'మూడునాళులుండు ముచ్చటేరా ఇది
పై మెరుగులెకాని పస హుళక్కి
పోల్చి చూడ జగము బూరుగు పూవురా
మఱువబోకు, నిజము మెఱుగు కాదు.'

అనువాదం : శ్రీ వి. సి. మౌళి.

# కళ్ళు

మూలం
కె.టి. మొహమ్మద్

అనుసరణ
వి. ఆనంద మోహన్

చూడటానికి కళ్ళున్న ప్రతివాడూ నన్ను చూడగానే ముందు నవ్వుతాడు. కొందరు అతి విచిత్రంగా నవ్వుతారు. నన్నుగురించి చాలా తమాషాగా కథలు చెప్పుకుంటారువాళ్ళు. కాని వాళ్ళేమంటారో, వాళ్ళెందుకలా నవ్వుతారో నాకు బాగా తెలుసును. నాకు ఒక ప్రేయసి వుండటం వాళ్ళు నవ్వటానికి ఒక కారణం! అంతే కాకుండా నేను ఆమెను పెళ్ళిచేసుకోవటం రెండోది! నే నెలా ఒక ప్రియుణ్ణి, తర్వాత భర్తను అయ్యానో తలచుకుంటే వాళ్ళకు ఆశ్చర్యంతో పాటు నవ్వుకూడా వస్తుందట! మీరుకూడా వాళ్ళలా ఆనందించాలనుకుంటే ఒకమారు నా వంక చూడండి. మీ ఎదురుగా నిలువబడటానికి నే నంతగా సిగ్గుపడను. మీకు నాలో ఏమంత నవ్వదగిన విషయం కనిపించింది? నేను మీలాగ ఒక మానవుణ్ణే!

బొగ్గులా నల్లగా, పొట్టిగా వుండే వికలాంగుణ్ణి నేను. నా పెద్దతలవుంది చూశారూ అది నా అంగవైకల్యమనే సామ్రాజ్యానికి రాజుగారు. నా మొహంలో రెండు పెద్ద గుంటలున్నాయి. వాట్లోనే నాకళ్ళ స్థిరనివాసం. ఒక చిప్పిడిముక్కు, కప్పనోరులా పెద్దనోరూ, సన్నని నుదురూ, చేటల్లాంటి రెండు చెవులూ, వీటికి తోడు స్ఫోటకంమచ్చలు! చిన్నతనంలో ఎప్పుడోకాని ఎత్తునుంచి క్రిందపడ్డానట, దానిఫలితమే నా కుడికాలు కుంటిగా వుండటం! ఇది నా ఆకారం. నిజానికి నేను చాలా వికారినే! కాదనను.

నన్ను మొదటసారిచూసిన ప్రతీవాడికీ కొండముచ్చుగుర్తు వస్తుందంటాడు. కాని తెలియక అడుగుతాను కొండముచ్చునుచూస్తే అది వికారంగా వుందని, నవ్వుతారా? అలా నవ్వరుగా! వాళ్ళందరికీ నవ్వు ఎప్పుడువస్తుందంటారేమో! ఈ కోతి ఆకారం కలిగిన ఈ ఆకారం మనిషి అని వాళ్ళు గుర్తించగలిగినపుడు! వాడికెవడికో మొన్న నన్ను చూడగానే Hunch Back of Notre Dam గుర్తు కొచ్చాడుట! అసలు నేను గూనివాడిని కాకపోయినప్పటికీ వాణ్ణలా నడి రోడ్లో విలవ్వేసి ఏమిటన్నావని ప్రశ్నించలేము. నన్ను చూడగానే ఎవడికి ఎవరు

గుర్తుకొస్తారో నిశ్చయించటం నాపంతుకాదుగా! అయినా వాళ్ళలా నవ్వబట్టే నన్ను గురించి నేను చాలా తెలిసికోగలిగాను.

సీతాకోకచిలకల్లాగా ముస్తాబై రోడ్లల్లో తిరుగుతున్న ఆడవాళ్ళని చూస్తే "నన్ను ముట్టుకోకు నామాలకాకి" చెట్టులాగా నాలో నేనే కుంచించుకుపోతాను. ఎందుకంటారా ? నాకేమో భయంపుట్టేలా అదోలా చూస్తారు వాళ్లు నావంక. మీలాగే నేనూ ఒక మనిషిని కావటంవల్ల అందమయిన వస్తువులనుచూసి నేనూ ఆనందించగలను. కాని నేనలా చేస్తే నేనేదో క్షమించరాని నేరం చేశానన్నట్లుగా మాట్లాడుతారు మీరందరూ. ప్రపంచమంతా ఏకకంఠంతో నాలాంటి వ్యక్తులకి తనలోతావులేదని, మేమూ అక్కడ ఆ ప్రాంతాల్లో మీలాగే జీవించటానికి హక్కు లేదని అంటుందని నాకు తెలుసు!

నాకు ఊహ రాకమునుపే మానాన్న చనిపోయాడు. ఇల్లంటే మాఅమ్మ అని తప్పిస్తే చాలాకాలం వరకూ వేరే అర్థం ఎరుగను. నా అంగవైకల్యానికి నేను వికారిగా వుండటానికి కారణం ఎవరు ? అమ్మా ? నాన్నా ? ఇద్దరూకాదు! నేనలా పుట్టివుంటాను. నేను పుట్టగానే వీడెందుకు పుట్టాడా ? వీడు పుట్టకపోయినా బాగుండుననుకుని వుంటారు అమ్మా, నాన్నా, ఇద్దరూ!

"నాయనా పెళ్ళిచేసుకోరా. కోడలువస్తే నాకు కొంచెం చేదోడు వాదోడుగా వుంటుంది" అన్నది మా అమ్మ ఒకరోజుని. ఆవిడలా అనటం నాకేం ఆశ్చర్యం గొలుపలేదు. కాని నేను అందగాడిని కాననేభావం మనసులో వుంచుకుని భారమైన హృదయంతో "అలాగేనమ్మా" అన్నాను. ఇరుగుపొరుగు అమ్మలతో నాపెండ్లి విషయం ప్రస్తావించేది మా అమ్మ! ఇలా కొన్ని రోజులు గడిచాయి. రోజూ బాధతో కూడిన భావం మెరిసేది ఆమె కండ్లలో. ఆమె కోరిక తీర్చటం నాకో సమస్యగా తయారయింది. ఆమె బాధకు కారణం ఊహించుకోగలిగాను. అందంగాలేని మగవాణ్ణి ఏ ఆడదిమటుకు ఎలా చేసుకోటానికి ఇష్టపడుతుంది? అయినా రోజూ అడిగేవాడిని. "ఏమమ్మా అలా వున్నావని" ఏమీలేదని ముక్తసరిగా వచ్చేది జవాబు. ఇలా రెండువారాలు గడిచాయి. అమ్మ బయటకు వెళ్ళడం మానుకుంది. ఇంతవరకూ నన్నుచూచి నవ్వనివాళ్ళు ఇప్పుడు నవ్వటం మొదలు పెట్టారు. ఒక ముసలివాడు నన్నుచూచి జాలిగొలిపే స్వరంతో "పాపం! వాళ్ళమ్మ ఎంత కష్టపడుతోందో వీడికి పెళ్ళిచేయటానికి. భగవంతుడా, ఇలాటి వాళ్ళని ఎందుకు సృష్టిస్తా" వన్నాడు.

ఆతర్వాత అందంగా ఉండటానికిగా మంచి పంచి బట్టలు వేసుకోవడం మొదలు పెట్టాను. కాని నాయీ ప్రయత్నంతో అందరూ నన్నుచూచి మరింతగా నవ్వటం ప్రారంభించారు. నేనింకా వికారంగా కనిపిస్తున్నానా అనే ప్రశ్న బాధించేది నన్ను. కాని ఒకవిషయం గుర్తుకొచ్చింది. ఏదావి ఉతికినా ఎలుకతోలు నలుపేగాని తెలుపుకాదని!

ఎలాగో ఒకలాగు నేనూ ఒక ప్రేయసిని సంపాదించటంలో కృతకృత్యుణ్ణయాను. ఇప్పటికే నా చరిత్రతో మిమ్మల్ని విసిగించివుంటాను. నేను ప్రేమించాలనీ, ప్రేమింపబడాలనీ కూడా ఆరాటపడ్డాను. ఇది ప్రకృతిసిద్ధంకాదా? నా ప్రేమ గాథ చాలా విచిత్రమయిన గాథ! ఆ గాథలోనే ప్రపంచంలోని వ్యక్తులందరిచేతా గర్హింపబడిన నన్ను ప్రేమించి, తుదకు పెండ్లిచేసుకుని, నేను స్వార్థంతో చేసిన పని ఫలితంగా మరణించిన యువతికి ఒక పాత్ర వుంది! మా అమ్మ తనకు కోడల్ని తెచ్చుకోవాలని చేసిన ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరయింది. ఈ భారంతో వూగిసలాడుతున్న అమ్మ ముసలితనంలో వచ్చే జబ్బులకు చాలా తేలికగా గురిఅయింది. మరలా వాటినుంచి ఆమె కోలుకోలేదు.... దాన్నిగురించి నేనంతగా బాధపడను. ఎందుకంటారేమో ఆమెలో బాధలను ఇంకా సహించ గలిగిన బలంలేదు!

ఆ తరువాతే జరిగింది........మెట్లదగ్గర కర్రతోకొట్టిన శబ్దం వినిపించింది ఒకనాడు. శబ్దంతోపాటు "బాబూ ధర్మం"— అనే కేక వినిపించింది. వెళ్ళి చూశాను. బిచ్చగత్తె! ముందు ఆమెవంకా, తరువాత ఆమె కళ్ళవంకా చూశాను! కరుణ వెల్లివిరిసి ప్రవహించవలసిన సమయం! పాపం! ఆమె జీవితంలో ఆమె చేయగలిగినదల్లా దేన్నయినా చేత్తో తాకి తెలుసుకోవటం, లేకపోతే వినటం అంతే! చూడటానికి అందంగాలేదు. కాని యౌవనం దాటకపోవటంవల్ల ఒక అందం వచ్చింది. పాపం అనిపించింది నాకు! ఆనాడే నా హృదయంలో ఆమె ఒక విశిష్టమయిన స్థానం ఆక్రమించుకుంది. ఆ తర్వాత నా జీవితంలోనే ఆక్రమించుకుంది! "నువ్విలా లోపలకువచ్చి కూర్చోవచ్చు" నన్నాను. ద్వారంకోసం తడుములాడింది! చేయి వూతగా ఇచ్చి తీసుకువచ్చాను. నా జీవితంలో ఒక యువతిని తాకటం మొదటిమారు! కాని ఆవేశాన్ని అణచుకోగలిగాను. ఒకమారు ఆమె మొహంవంక చూశాను. కళ్లు లేకపోయినా ఆమె మొహంలో శోభకేం తక్కువలేదు. ఆమె నాకు దూరంగాలేదు. ఇంకా నా ఆలోచన సాగకమునుపే

నా శరీరం వణకనారంభించింది. పెదవులు ఎండిపోయాయి. చేతులూ, కాళ్లూ అదోలా అయ్యాయి. గుండె త్వరగా కొట్టుకోవటం మొదలుపెట్టింది....

"ఇలా కూర్చో" అని వరండా ఒక కొసని కూర్చోపెట్టాను. నా చేతులు వణుకుతున్నాయని గ్రహించకలిగిందా ?........ నే వండుకున్న అన్నంలో కొంచెం పెట్టి ఒక రూపాయి తీసిచ్చాను. ఆమె తన పేరు 'లీల' అనీ, వూరి చివర గుడిసెలో తన అమ్మతోకలిసి నివసిస్తున్నాననీ చెప్పింది. ఆమె వెళ్ళిపోయే టప్పుడు అప్పుడప్పుడూ వస్తుండమని చెప్పాను. లీల తర్వాత తరచు రావటం ప్రారంభించింది. క్రమేణా అది అలవాటులోకి దిగింది ఈ విషయం ఆ విషయం అనే విచక్షత లేక మేము అన్ని విషయాలను గురించీ మాట్లాడుకునే వాళ్ళం. ఆమెతో మాట్లాడుతూ నా బాధలన్నీ మరచిపోయేవాడిని. జీవితం నాకు మునుపటి కంటె మధురంగా కనిపించింది. కాని లీలకేగనుక కండ్లుంటే ! ఇది ఎంత తెలివి తక్కువ కోరికో నాకు తెలియకకాదు. ఆమెకే గనుక కండ్లుంటే ఆమె బిచ్చగత్తె అయేదే కాదు ! ఒకవేళ బిచ్చగత్తెగావున్నా నావద్దనుంచీ ధర్మం తప్పిస్తే మరేమీ స్వీకరించేదికాదు. అంతేకాదు ! ఆమె దృష్టి ఆమె నావద్దకు వచ్చి రోజూ ఇలా మాట్లాడటానికి అనుమతించేది కాదు !

నేనూ మీలాంటి మానవుణ్ణే కనుక ఇంత తెలివి తక్కువగా ఆలోచించ గలిగాను అది నా అపరాధమా ?

లోకం మేమిలా కలిసికోవటం గుర్తించింది. నేను దాని దృష్టిలో కొండ ముచ్చుని కావటంవల్ల ఎప్పుడూ దాని పరిహాసానికి పాత్రుణ్ణే ! కాని ఇప్పుడు నా ప్రేమగాథ వారందరికీ మరింత నవ్వుగొలిపింది. వారందరికీ కుంటితనానికీ, గ్రుడ్డి తనానికీ కల సంబంధం వింతగొలిపింది. తమాషాగా లేదూ ?

నన్నుగురించి నీ అభిప్రాయ మేమిటని ఒక రోజున ఆమెని అడిగాను. నా ప్రశ్నకు జవాబుగా వచ్చిన సిగ్గుతోకూడిన ఆమె నవ్వు నాకు చాలా ఆనందాన్ని కలిగించింది. కాసేపాగి "మీరు చెడ్డవారని ఎప్పుడయినా అన్నానా ?" అన్నది మృదువుగా ! ఆమె హృదయపూర్వకంగా, మర్మం విడిచి చెప్పిన మాటలుగా భావించాను. నిజానికి నే నామెను అడగాలని అనుకోకపోయినా ఆ ఆవేశంలో నాకు తెలియకుండానే "నేనంటే నీకు ఇష్టమేనా లీలా ?" అని అడిగాను. ఏమీ మాట్లాడకుండా సిగ్గుతో తలవంచుకుంది. జీవితంలోని మధురక్షణాలన్నీ అవే నాకు ! లీల తర్వాత వాళ్ళింటికి వెళ్ళిపోయింది ! "లీల" నేనుకూడా ఈ ప్రపం

చంలో ప్రేమగా ఉచ్చరించగలిగిన రెండు అక్షరాలవి. ఆనందంతో ఒకరి కొరకు ఇప్పుడు ఎదురుచూడగలను. పూర్వం నిరాశా, నిస్పృహతో కూడిన నా జీవితం, ఇప్పుడు నాకు మధురంగాను, అనుభవించతగ్గదిగాను కనిపించింది. అది నా అదృష్టం గాదా ?

నన్ను చూచి నవ్వేవాళ్ళందరూ నా శత్రువులే! బహుశః నా వికారమైన శరీరాన్ని గురించి ఏమయినా వాళ్ళు లీలకు చెప్పారేమో! వాళ్ళసరికి ఆపని చేసే వుంటారా? ఏమో ఎవరికి తెలుసు: రాత్రికి పగలుకు భేదం కనిపెట్టలేని లీల, ముచ్చట గొలిపే అందానికి, అసహ్యం కల్పించే అంగవైకల్యానికీ భేదం ఎలా కనిపెట్టుతుంది? తను పుట్టినప్పటినుంచి గ్రుడ్డిదాన్ననే చెప్పింది. ఆమె గ్రుడ్డిదిగా పుట్టింది నా అదృష్టం అని చెప్పను. కాని అది ఆమె దురదృష్టమా ?

లీల మరసటిరోజుని వచ్చింది. ఆమె వచ్చేసరికి నేను మాయిద్దరి వివాహం గురించీ ఆలోచిస్తూ వున్నాను. ఎలా వివాహం జరిపించటం ? పురోహితులు ఎవరూ వుండక్కర్లేదా ? కాని ఏ పురోహితుడూ మా వివాహం జరిపించటానికి రాడు. దానికో కారణం వుంది! వాళ్ళకు ప్రపంచంలో ఆధ్యాత్మిక దృష్టి ఒకటి వుంది. నేనూ లీలా దాని ప్రకారం సమవృత్తిలం కాదు. వాళ్ళు అందుచేతే మాకు సహాయం చేయరు. ఈ ప్రపంచంలో ఆడవాళ్ళు మగవాళ్ళకంటె చాలా ఎక్కువగా వున్నారనీ, లీల తప్పిస్తే మరే ఆడదీ నన్ను వివాహం చేసుకోవటానికి ఇష్టపడదనీ ఎంత ఎలుగెత్తి చాటినా సహాయం చేయటానికి ఎవడూ రాడు. అందులో మరో విషయంకూడా! నేను తురకవాడిని, లీల హిందువు.

ఆమెను ప్రశ్నించాను. "నన్ను పెళ్ళిచేసుకుంటావా ?" అని. ఆశ్చర్య పోయింది. నేను తురకవాడిననే భావం బహుశః ఆమెను ఏమీ మాటలాడనీయకుండా చేసిందనుకుంటాను.

"మీరేమంటున్నారు ?"

"లీలా! నేనూ ఒక మానవుడిననే విషయం గుర్తుంచుకో. భగవంతుడు నిన్ను నావద్దకు పంపించాడు. కులమత వివక్షతలు మానవుడి దృష్టి"

మాటలాడుతూ వణకుతున్న ఆమె పెదవులకేసి చూశాను. బోనులో నిలువబడిన ముద్దాయి న్యాయాధిపతి తీర్పు కెలా ఎదురుచూస్తాడో అలా చూశాను. నేను చావటమూ, బ్రతకటమూ ఆమే నిశ్చయించాలి! లీల నిశ్శబ్దంగా వుంది! నేను మాటలాడుతూనే వున్నాను. "నీ అభిప్రాయం చెప్పు లీలా! నేను నిన్ను

నా జీవితంలో నాకు సహచరిణిగా తీసుకుందామనుకుంటున్నాను. నా ఈ కోర్కె తీర్చగలనని ప్రమాణం చెయ్యి!"

"అంగీకరిస్తాను" అన్నది చివరకు. "నన్ను గురించి ప్రపంచం హేళనగా మాట్లాడుతూ వుంటే విన్నాను. నేనలా వెళ్తుంటే 'అదిగో ఆ కొండముచ్చుగాడి భార్యపోతూవుంది' అన్నారు వాళ్ళు. వాళ్ళ వూహప్రకారం మీ రందమయిన వారు కారు."

వాళ్ళసంగతి అలావుంచు నీవేమనుకుంటున్నావు లీలా?"

"నాకు అందంసంగతి తెలియనే తెలియదు. పోతే కొండముచ్చును నేను చూడనూలేదు. అందుచేత వాళ్ళేమన్నా నేను లెక్కచెయ్యను. మీరు చాలా అందమయినవాళ్ళు అనిచెప్పినా నాలో ఏభేద భావము మీరు చూడలేరు. నేను హృదయాన్ని ప్రేమిస్తానుకాని మనిషి భౌతిక అకారాన్నిగాదు. ప్రపంచాన్ని నామనసు సహాయంతోనే చూశాను. అందాన్ని, అందవిహీనతనూ నామనసు సహాయంతోనే చూస్తాను. మీరు తురకవాళ్ళు, నేను హిందువును! మీకే అభ్యంతరమూ లేకపోతే నాకూ ఏమీలేదు. ఈ ప్రపంచంలో నన్ను ప్రేమించి మనసిచ్చే వ్యక్తే లేదనుకున్నాను. కాని" –

"కాని—?" నాకంఠంలో చాలా ఆదుర్దా ధ్వనించింది.

"ఒక్కమాట! బిచ్చమెత్తుకు తినటం వెనుక చాలా గాథవుంది. గ్రుడ్డిదాన్నయినా ప్రేమించాలని ఆశపడేదాన్ని. కాని నాభిక్షాపాత్ర—పగలంతా గడిచినా ఖాళీగావున్న మా కడుపులకేసిచూసి వికటంగా నవ్వేది. అర్ధరాత్రి వచ్చేపోయే మనుష్యుల పశుబలానికి లొంగిపోవలసి వచ్చేది. మీరు నన్ను అసహ్యించుకున్నా మీరిప్పుడు చేయగలిగేదేమీలేదు. ఒక గ్రుడ్డియువతి జోలెలో ఏమగవాడూ ధర్మం పేరునఓకానీ వేయడు. మీరు మొదటిరోజున నన్ను పిలిచి ధర్మం చేసినపుడు మీరూ అవుద్దేశంతోనే పిలిచారనుకున్నాను. కాని క్షమించండి! ఈనాడు ప్రపంచంలో మానవుడుగా మానవత్వం మూర్తీభవించిన వ్యక్తిగా మిమ్మల్నితప్ప మరెవ్వరినీ గౌరవించను. గౌరవించలేను."

క్షణకాలం నిశ్చేష్టుడనయాను, "లీలా" అన్నాను నిశ్శబ్దాన్ని భేదిస్తూ. "నీవు చెప్పిందల్లా మానవుని స్వార్థాపేక్షను గురించి. ఇక ఎప్పుడూ దాన్ని గురించి ఆలోచించను." ఆమె మౌనంగా వుండిపోయింది.

మాచుట్టు ప్రక్కల నివసించే వారినవ్వు మరింత బిగ్గరగా వినిపించసాగింది. సంఘం కట్టుబాట్లు మావంక ఆత్యాశ్చర్యంగా అతిహీనంగా చూచాయి. లోకానికి దహించుకుపోతున్న రెండు హృదయాలు ఒక ప్రేమ గాథలో పాత్రలు ధరించా యని తెలియదు. లీలను సంతోషపెట్టటానికి ప్రయత్నించాను. "వాళ్ళు నవ్వితే మనకేం, వాళ్ళపళ్ళే బయటపడతయి" అన్నాను పకాలుమని నవ్వింది నాలీల!

జీవితం మరో అధ్యాయంలో ఇద్దరం కలసి జీవయాత్ర సాగించాము. మా యిద్దరి దాంపత్యం జీవితంలో అతిసౌఖ్యం కలుగచేసిందని నే నను. కాని సుఖంగానే గడిచింది. సంఘం దాని కట్టుబాట్లు మా మీద కత్తి గట్టాయి. మాకు ఎవరి వద్దనుండీ కూడా ఏవిధమయిన సహాయమూ లభించలేదు. మేమింత సుఖంగా జీవించగలమని మునుపు ఎన్నడూ అనుకోలేదు. కాని జీవించాలనీ, అవసరమయితే ఎన్ని కష్టాలయినా ఎదుర్కోవాలనీ అనుకున్నాం!

లీల మాతృత్వం వహించబోతూవుంది. ఆమె మాతృత్వానికి నాకుంటి తనమూ, ఆమె గుడ్డితనమూ ఏ విధంగానూ అడ్డంరాలేకపోయాయి. ప్రపంచం చేసే హేళనలను మేము లెక్కచెయ్యలేదు జీవితంలో ఎన్నడూ ఆశించనంత సౌఖ్యం అనుభవించాను. ప్రేమికుడినిగా ప్రారంభించి, భర్తనయి, ఇప్పుడు తండ్రిని కాబోతున్నాను. భగవంతునికి కృతజ్ఞతచెప్పుకున్నాను. మా అమ్మే వుంటే?.... ఎంత సంతోషించేదో.

కాన్పుకు పూర్వం రెండు నెలలకు లీలకు జబ్బుచేసింది. వైద్యుడిని పిలుచు కొచ్చాను. ఆమెను పరీక్షించాడు. ఆమెను కాపాడమని ఆయనను నేను ప్రార్థిం చాను. "ఇదేమంత ప్రమాదమయినదికాదు. ఆమెకు ఆరోగ్యంకలిగేలా చూస్తాను" అన్నాడాయన. కొంచెంఆగి. "ఆమె పుట్టుగ్రుడ్డా?" అని అడిగాడు. అవునన్నాను. మళ్ళీ ఆమె కండ్లను పరీక్షచేసి ఆలోచిస్తూ "ఆపరేషనుచేసి ఆమెకు చూపు తీసుకు రాగలను. కాని ఇపుడది అసంభవం! అమె బాగా ఆరోగ్యవంతురాలయినతర్వాత గాని వీలుకాదు."

ఆయన మాటలను విన్నపిమ్మట నాకు తలతిరిగిపోయినట్టయింది. లీలకు చూపు తెప్పిస్తానంటున్నాడు. ఆమె చూడగలిగినపుడు నన్నుచూచి అసహ్యించు కుంటుంది. మునపటిలా ప్రేమించి గౌరవిస్తుందా? ఏమో! ఆయనతో ఏం చెప్పను? "వద్దు! ఆమెకు చూపు అవసరంలేదు" బిగ్గరగా అరవటానికి ప్రయ

శ్నించాను. కాని నెమ్మదిగా "లీలా! నీకు చూపు కలుగచేస్తానంటున్నారు" అన్నాను.

అంతకుమునుపే ఆమె విన్నదానిని యంత్రంలా మరలా చెప్పాను. ఆమెకు దృష్టి రావటం మా దాంపత్య జీవితానికి గొడ్డలిప్రేటు అని ఎలా విశదీకరించేది? పుట్టినప్పటినుంచీ వున్న గ్రుడ్డితనం పోవటం ఒక మనిషి అదృష్టం కాదా? నా హృదయాంతరాళంలో వున్న ప్రతి విషయాన్ని గ్రహించగలిగిన లీల నాలో యీ భావం కనిపెట్టలేకపోయింది

"నాకు మరలా దృష్టివచ్చే అవకాశమేవుంటే తప్పకుండా ఆ అవకాశాన్ని వినియోగించుకుంటాను. మీకు సంతోషంగా లేదూ? మిమ్మల్ని నే చూడగలిగితే మీరు నన్నింతకంటె ఎక్కువగా ప్రేమిస్తారని నాకు తెలుసు!" అన్నది లీల. అంత జబ్బులో కూడా ఆ భావనతో ఆమె మొహంలో వికాసం కనిపించింది. డాక్టరుగారు ప్రిస్క్రిప్షను యిచ్చారు. ఆమందు ెలా వాడాలోచెప్పి "మరలా ఆరోగ్యం కలిగిన తర్వాత నా వద్దకు ఆమెను తీసుకురండి ఆపరేషను చేస్తాను" అన్నారు.

లీల నిశ్శబ్దంగా వుంది. నాలో తుఫాను చెలరేగింది. చెడ్డ తలపులతో నా హృదయం దహించుకుపోతున్నది. వరండా కొసకు వెళ్ళి కూర్చున్నాను. భావాలు అమితవేగంగా దొర్లిపోతున్నాయి. ఈ ఇంట్లోనే నాకొంచెం శాంతి వుండేది. అదికూడా నాశనమవుతున్నది. లీలకు దృష్టి రావటానికి తగిన ప్రయత్నం ఏమీ చేయనివ్వను. నా శత్రువులతోకలసి నా జీవితాన్ని, జీవితమాధుర్యాన్ని, ఆనందాన్ని నాశనంచేయటానికి కుట్రపన్నినట్లున్నాడు యీ డాక్టరు. ఆ బాధతోనే చచ్చిపోతాను. కాని చచ్చిపోయేముందు ఆయన్ను చంపి మరీచస్తాను. మా చల్లని దాంపత్య జీవితంలో నిప్పులు పోయటానికి వచ్చాడీయన! కాదు! ఆయన్నిగాదులే తిట్టాల్సింది. ఆయన ధర్మం జబ్బులను పారద్రోలటం. గుడ్డితనం కూడా ఒక జబ్బే. దాన్ని నయంచేయటంలో విముఖత చూపలేడాయన. లీలకు దృష్టివచ్చేలా తప్పకుండా చేయవచ్చును. కాని ఆమెకు చూపువచ్చేలోగా నేను మట్టిలో కలసిపోవాలి. ఆమె కొందముచ్చుఅంటే ఏమిటో తెలిసికొనేలోపలే నేను చనిపోవాలి! అప్పుడుగాని దయాపూరితుడినిగా, ప్రేమికుడుగా, ఆమె హృదయంలో విశిష్టమయిన స్థానం ఆక్రమించుకోలేను. నాలో ఆమె చూడగలిగిన అందం, ఆమె నాపై చూపే ప్రేమ కలకాలం వుంటాయా?

లీలకు కొడుకుపుట్టాడు. సంఘం పూదూ పేరూ లేని ఒక పిల్లవాడు పుట్టాడని తెలిసికోగానే సంచలనం కలుగచేయ ప్రారంభించింది. కొందరు బిగ్గరగా

నవ్వారు. తమాషాగాలేదూ? పాపకు లీల చూపులూ నా కళ్లూ వచ్చాయి. ఇది ఎవరిఅదృష్టం? లీల మళ్ళీ ఆరోగ్యవంతురాలయింది. నా స్వార్థం ఏ విషయంలో అయితే నన్నణచిపట్టిందో ఆ విషయం ఆమె గుర్తుచేసింది. "మనం డాక్టరు దగ్గరకు వెళ్దామా" ఆమె పెదవులపైనుంచి వచ్చిన ఈ వాక్యం నా మనసుకు ఎంత క్షోభ కలిగించిందో ఆమెకు తెలియదు. ఆమెతో అబద్ధంచెప్పాను! "అవును సుమా! మరిచేపోయాను. ఈ రోజున వెళ్ళి కనుక్కుంటాను" నేను అబద్ధ మాడుతున్నానని నాకు తెలుసు. నడిసముద్రంలో పడి తన్నుకులాడుతున్నట్లుగా బాధపడ్డాను. బయటికి వెళ్ళి రెండుగంటలు అలా తిరిగివచ్చి "ఆ డాక్టరుగారు పాపం నెలక్రిందట చనిపోయారుట" అని చెప్పాను. అంతకంటే నేను చెప్పగలిగిందేమీలేదు. ఆమె భర్తగా వుండి ఆమెకు చూపు తెప్పిస్తానన్న డాక్టరుగారి మరణాన్ని గురించి విచారం ప్రకటించి నటించలేక పోయాను. దహించుకుపోతున్న నా హృదయాన్ని, నా స్వార్థంతో అణచిపట్టాను. నా స్వార్థం కోసం చేసినపని, నా మనశ్శాంతికోసం నేను చేసిన పని, జీవితమంతా నాకు శాంతిలేకుండా చేసింది. ఇలా రోజులు గడిచాయి..........

ఒకనాడు హృదయ విదారకమయిన దృశ్యం చూశాను. ఇంట్లో అడుగు పెట్టగానే నట్టింట్లోవున్న అండాను ఎవరూ పక్కకు జరుపలేదు. పిల్లవాడు వుయ్యాలలోనుంచి కెవ్వున కేకవేయగానే చేతికర్ర లేకుండా ఉయ్యాల దగ్గరకు వెళ్ళాలని ప్రయత్నించిన లీల దాన్ని తట్టుకుని ద్వారానికి కొట్టుకుని క్రిందపడ్డది. రక్తం ప్రవాహన్యాయంగా ప్రవహిస్తున్నది. ఆమెను తీసుకొని ఆస్పత్రికి పరుగెత్తాను.

జీవితాలు దగ్ధమవుతున్నయి. మీకీస్థితిలో నవ్వాలనివుందా? నేను మిమ్మల్ని ఏమీ అనను మీరు నవ్వినా. ఒకవేళ నేనన్నా నా మాటలను లెక్కచేసేవా దెవడు? లీలే నా జీవితం! ఆమే నా ప్రపంచం!

డాక్టరుగారు పిలిచారు. "మంచి దెబ్బ తగిలింది." లీల దగ్గరకు వెళ్ళాను. నొప్పితో బాధపడుతూంది. పలుకరించాను. ఏడ్చింది. "వచ్చారా? నేను వెళ్ళి పోతున్నాను. కాని వెళ్ళిపోయేముందు ఒక్కసారి నా కళ్ళతో మిమ్మల్ని చూడాలని వుంది." లీల కడసారికోరిక నా సహనానికి ఒక పరీక్ష అయింది. ఆ డాక్టరు చనిపోయాడని ఆమె దుఃఖపడుతూందా? ఆమె మౌనంగావుంది.

"లీలా, నువ్వు నన్ను కళ్ళతో చూడగలగటం గొప్ప విషయంకాదు. నీ విశాలమయిన, నిర్మలమయిన హృదయంతో చూడలేవా? ఈ ప్రపంచంలో

నువ్వొకర్తెవే నన్ను సరిగా అర్థంచేసుకోగలిగావు. మానవులు ఒకరి నొకరు కండ్లతో చూసుకోలేరు. మనసులో శాంతి కల్పించుకో. ఆరోగ్యవంతురాలి వవుతావు."

నేను చెప్పినదల్లా విన్నది. కాని ఏమీ మాట్లాడలేదు. సూర్యుడస్తమించ డానికి సిద్ధంగావున్నాడు. లీల ఏడవటం ప్రారంభించింది. నేను విచారంలో మునిగిపోయాను. నారహస్యం నానోటిగుండా బట్టబయలు కావటానికి తగిన పరిస్థితి ఏర్పడుతున్నది. అక్కడ ఇంక నిలువలేక పోయాను. పాపకూడా కెవ్వన వేసి ఏడవటం ప్రారంభించింది. నేను నిస్పృహ చెందాను.

నిర్మలమయిన ఆత్మ లీలనుంచి నెమ్మదిగా విడిపోయింది. నేనేం చేశాను? నాకు తెలియదు. ఒకరిగుండె కొట్టుకోవటం ఆగింది. మరొకరిది పగిలి ముక్క లయింది.

సూర్యుడు అస్తమించాడు. చీకటి దట్టంగా అలుముకున్నది. నా జీవితం అడుగునపడి నలిగిచినిగిన నా ప్రేమగాథ తెలియని వాళ్ళంతా నన్నుచూచి ఇప్పటికీ నవ్వుతుంటారు. నాకు కొన్నిమార్లు ఆశ్చర్యం వేస్తుంటుంది, నేనూ గుడ్డి వాడినయితే నాగాథ ఎలా వుండేదో అని—"



## ఎంత చిన్న మొత్తమయినాసరే,
## పొదుపుచేసుకోవడం మంచిది

## ఆదాయంపన్ను లేని *5.41* శాతం వడ్డీ

కొత్త 12 సంవత్సరాల నేషనల్ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లను కొని ఆదాయం పన్నులేని 5.41 శాతం వడ్డీని సంపాదించండి.

మీరు పెట్టుబడిపెట్టిన ప్రతి రూ. 100 లు 12 సంవత్సరాలలో రూ. 165 లు కాగలవు.

ఈ సర్టిఫికెట్లు పోస్టాఫీసులలో లభిస్తాయి.

## మీరు మిగుల్చుకున్న సొమ్ముపై యిప్పుడు ఎక్కువ ఆదాయం వస్తుంది

10 సంవత్సరాల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు పరిణతి చెందిన పిమ్మట ఏటా 4 శాతం వడ్డీవస్తుంది. పన్నులేని వడ్డీ ఏటేటా మీకు చెల్లించబడుతుంది.

పోస్టాఫీసులు సేవింగ్సు బ్యాంకి డిపాజిట్లు వడ్డీరేటు సాలుకి $2\frac{1}{2}$ శాతం. పోస్టాఫీసు గిఫ్టు కూపన్ పథకం ప్రకారం ప్రతి సందర్భానికీ మీరొక గిఫ్టును ఎన్నుకోవచ్చు— ఈగిఫ్టుకి భవిష్యత్తు ఉంటుంది.

# క్యూములేటివ్ టైమ్ డిపాజిట్టు పథకం

దీని క్రింద ఒక ప్రయోజనానికై మీరు సొమ్ము మిగుల్చుకొని పొదుపు చేసుకోవచ్చు.

ప్రతి నెలా రూ. 5 చొప్పున 5 సంవత్సరాలు కాని, 10 సంవత్సరాలుకాని డిపాజిట్ చేస్తే 5 లేక 10 సంవత్సరాల ఆఖరున మొత్తంగా మీకు వరుసగా రూ. 325, రూ. 725 వస్తాయి.

దీనిపై వడ్డీ 5 సంవత్సరాల పద్దు అయితే 3.3 శాతం, 10 సంవత్సరాల పద్దు ఐతే 3·8 శాతం కాగలదు.

దీనిపై ఆదాయం పన్నుకాని సూపర్‌టాక్సుకాని విధింపబడవు.



ఆంధ్రప్రదేశ్ జాతీయ పొదుపు సంస్థ డైరెక్టర్‌చే ప్రకటితము.

## పుస్తక పరిచయము :

# కన్న కూతురు

**(సాంఘిక నాటిక)**

రచన :
**అముజాల నరసింహమూర్తి**
**హిందీప్రచారక్, తోలేరు.**

**134 పుటలుగల ఈ నాటకము**
**వెల రు. 2.**

దీనికి కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "ఆశీస్సు" లిచ్చి కథచెప్పి. "ఇప్పటివారి అభిప్రాయానుసారముగా నిట్లు కథ కల్పింపబడినది. కాని నాటిక నియమములు స్వీకరించబడలేదు" అన్నారు. ఈ నాటకమునకు కథానాయకుడు శ్రీహరిరావు అను వృద్ధుడు. రెండు వివాహములు చేసికొనినాయినను కామవాంఛాతృప్తిపొందక మూడవపెండ్లిచేసికొన తలపడును. ఈసారి వధువు తానిదివరకు చేరదీసిన స్త్రీ కూతురు. అందుచేత "కన్నకూతురు" అని పేరుపెట్టారు. చివరికి ఆమె తనకూతురని తెలిసి, తన మేనల్లుడికిచ్చి పెళ్ళి చేస్తాడు. ఇప్పటివారి అభిప్రాయానుసారముగా ఈ కథ కల్పింపబడినట్లు కవి సార్వభౌము లభిప్రాయపడినప్పటికీ, కన్నకూతురితో కళ్యాణముచేసే కథా విధానం మెచ్చుకొనేది ఇప్పటివారి అభిప్రాయానికికూడ అనువైనదికాదేమో·! ఈ నాటకములో గొప్పవాళ్ళను ధనవంతులను యథాశక్తిదూషించుట, పేద వారిని భూషించుట జరిగింది. మధ్యలో కొంత భగవత్భక్తి, కొంత వేదాంతము కొంత గాంధీభక్తి మేళవింపజేశారు రచయిత. గాంధీజీని అవతారపురుషునిచేసి ఆయన యిష్టకామ్యసిద్ధియిచ్చు దేవతామూర్తిగా ఆరాధించుటతో నాటకము ప్రారంభమవుతుంది. బ్లాకు డెవలప్‌మెంటు అధికారుల ఆదరంకోసమో యేమో, పంచవర్ష ప్రణాళికాప్రశంసకూడా చేశారు. సాంఘిక నాటకమైనప్పటికి, రచన వాడుకభాషలో ఉన్నప్పటికీ, పాత్రలన్నీ ఉపన్యాసధోరణిలో ప్రసంగిస్తాయి. సందర్భానుసారముగా కొన్ని పద్యాలుకూడ నాటకకర్త వ్రాశారు. ఇవి పూర్వనాటకాల ధోరణిలోఉన్నవి. మొత్తంమీద నాటకం ఎలాగో రంగస్థలం మీద రక్తికట్టించాలనే ఉద్దేశంతో రచయిత ప్రేక్షకుల కరతాళధ్వనులు దృష్టిలోపెట్టుకొని ఈపద్యరచన చేసినట్లు కనిపిస్తుంది.

ఉదాహరణగా : నిజం ఆలోచిస్తే, 'జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః' అను వేదసూక్తిననుసరించి మానవుల్లో

కని ప్రేమ పెంచిన, జననీజనకులను
భక్తి సేవింపనివాడు మాల
అగ్నిసాక్షిగ గొన్న యర్ధాంగి విడి పర
భామల గూడెడువాడు మాల
మాతృదేశప్రేమ మరచి తద్ద్రోహంబు
బచరించుచుండెడువాడు మాల
పరజనౌన్నత్యంబు బరికించి యీర్ష్యతో
వర్తించుచుండెడివాడు మాల
బ్రహ్మవైశ్యక్షత్రియశూద్ర భావము లిల
వర్తనంబును బట్టియే వచ్చుగాని
పుట్టువున నెవ్వరికి గూడ పొసగదెపుడు
పూతగుణులార! భారతపుత్రులార!

ఈ ధోరణిలో నున్న పద్యాలు కథాయుక్తికి తోడ్పడకున్నా, రంగస్థల రక్తికి తోడ్పడతాయి. ఈ నాటకం ప్రయోక్త సామర్థ్యముచే విజయము పొందగల రచన.

—శ్రీవాత్సవ

## కురుక్షేత్రం

అనువాదం :
శ్రీ చావలి రామచంద్రరావు

ప్రతులకు :
విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2

వెల : రు. 2-50

శ్రీరామధారీసింహదినకర్ హిందీకావ్యానికిది ఆంధ్రానువాదము. దీనిని గురించి చెప్పబడునది యేది గలదో అది మూలగ్రంథ సంబంధి యగును. అనువాదమును గూర్చి చెప్పదగినవి రెండు మాటలు. యథాతథముగా మూల మనువదింపబడినదియు, లేనిదియు చెప్పుట యొకటి. ఏ భాషలోని కా గ్రంథ మనువదింపబడినదో ఆ భాషయందా యనువాదము చేసినవానికి చేయుట కాధికారికమైన యోగ్యత యున్నదియు, లేనిదియు చెప్పుట రెండవది. మూల మునకు సంబంధించిన ఆ మొదటి మాట శ్రీ వెంకటాచలశర్మ, శ్రీ రామ మూర్తి రేణు వంటి హిందీ పండితులు "మూలముతో పోల్చి అనూలాగ్రముగా

చదివించికొని వింటిని...అనువాదము మూలమునకు దీటుగా ప్రౌఢముగా నడచినది" అనినారు. ఇక రెండవది — రచయితయే ఇట్లు వ్రాసికొనెను. "నేను పండితుడను కాను...సామర్థ్యంకంటె ఉత్సాహం, నిరాశకంటె ఆశ ఎక్కువ కలవాణ్ణి...గ్రాంథిక భాషా నియమాలకు గానీ వ్యాకరణ సూత్రాలకు గానీ కట్టుబడదలచలేదు...చెవికి ఇంపుగా తోచిన ప్రతి సందర్భంలోనూ మిశ్రమ సమాసాలను నిస్సంకోచంగా ఉపయోగించాను." ఈ కావ్యము చదివినచో పై రచయిత మాటల యాథార్థ్యము తెలియును. అనువాదమును గూర్చి చెప్పదగినవన్న రెండు మాటలును చెప్పినట్లే యైనది. ఇక అసలు గ్రంథము.

యుద్ధము ముగిసి విజయుడైన ధర్మరాజు జరిగిన సర్వప్రాణిహనన మూలము తానా కాక దుర్యోధనుడా అనియు, అసలింతకును విజయము లభించినది దుర్యోధనునకువలె నున్నదిగాని తనకు గాదనియు, మానసికముగా నడలు కడలిబడి భీష్మునివద్దకు చేరినాడు. వారిరువుర సంభాషణములతో శ్రీ రామధారీసింహదినకర్ ఈ కావ్యమును వ్రాసెను. మొత్తము ఏడుసర్గలు. భీష్మ యుధిష్ఠిరు లాలంబనముగా యుద్ధము-శాంతి-యుద్ధ కారకులు-శాంతి కాముకులు-రాజు-ప్రజ-మానవుడు-మానవత-విజ్ఞానము-దాని వెఱ్ఱితలలు-పర పీడనము-సర్వసమత ఇత్యాది—ఆధునికములై బహుధాలోకమునపర్యాలోచన చేయబడు, బహ్వాంశము లొక క్రమమున ఈ కావ్యమున సమీక్షింపబడినవి. ఇది యొక అభ్యుదయ కావ్యము శ్రీ దినకర్ ఊహాపథము లుదాత్తములు. ఈ కావ్యమునందలి మొదటి ఐదు సర్గలు భీష్ముని యొక్కయు, ధర్మరాజు యొక్కయు మహాభారతములోని చిత్తౌన్నత్యము మర్యాదను నిలిపినవి. నిలుపుచు ఆధునికము లట్లుండుట కవియొక్క నిశితమైన ప్రతిభకు నిదర్శనము.

మొదటి సర్గలో ధర్మరాజు భీష్మునివద్దకు పోవుట- రెండవ సర్గలో ధర్మరాజు నిర్వేదము, భీష్ముని ఓదార్పు- మూడవ సర్గలో భీష్ముడు యుద్ధము యొక్క అనివార్యత, మానవుని హృదయము మనస్సున కెట్లు లొంగి శాంతికి దూర మగునదియు- నాలుగైదు సర్గలలో మహాభారతయుద్ధమునకు మూల భూతములైన బహ్వాంశములు, ధర్మరాజు యుద్ధభూమిని చూచి పరితపించుట, భీష్ముని ఉపశమన వాక్యములును.

షష్ఠసర్గ పూర్తిగా సప్తమసర్గ కూడ ఈ గ్రంథమునందలి వస్తువునకు సంబంధించినవి గావు. షష్ఠసర్గను గురించి శ్రీ దినకర్‌గారే ఆ యభిప్రాయ

మును వెలిబుచ్చినారు. ఆ సర్గ కేవలము కవి మధ్యలో కల్పించుకొని నేటి వారిని సంబోధించుట, భీష్ముడు-యుధిష్ఠిరుడు "హక్కులు" "ప్రగతి" ఇటువంటి మాట లనుట — శ్రీకృష్ణుడు ఏవో "సంస్కరణలు" చేసినాడనుట ఇత్యాదులు సమంజసముగా లేవు — ఇది అభ్యుదయ కావ్యమని గదా చెప్పబడినది !

"సుఖభోగంలో నరులందరు
సమభాగులు కానంతవరకు
అసంభవ మీ భువిలో శాంతి
ఎవడూ కారా దత్యధిక భోగి
ఏ నరుడూ కాకూడదు రోగి."

ఇటువంటి ఊహలు కొల్లలుగా గల కావ్యమిది. ఈ అనువాదము చూచిన తరువాత ఒక సుదీర్ఘమైన వస్తువుకూడ ఈ రకము గేయాలలో చెప్పబడ వీలున్న సూచన లగుపించుచున్నవి. కాని ఈ అనువాదకులు భాషా విషయమునను మూలమును కావ్యముగా అర్థము చేసికొనుట యందును కొంత శ్రద్ధ తీసికొని యుండవలసినది.

కౌరవోం కా శ్రాద్ధ కర్నే కేలియే
యాకి రోనేకో చితా కే సామ్నే
శేష జబ్ థా రహగయా కోయీ నహీం
ఏక్ వృద్ధ ఏక్ అందే కే సివా

అనువాదము : ఇంతకు అంతానికి
మిగిలిన సారం ?
దాయాదుల శ్రాద్ధ కర్మకో
కౌరవ ప్రేత చితుల సమజ్ఞాన
భోరున రోదించుటకో
వృద్ధ యొకతె, అంధు డొకడు
ఎండిన మొండి చెట్ల వోలె
మిగిలా రీ భువిపై.

మరొక ఉదాహరణ.

యహ్ మహాభారత్ వృథా నిష్ఫల్ హువా
ఉఫ్ జ్వలిత కితనా గరళ మయ వ్యంగ్యహై

పాంచిహీ అసహిష్ణు నర్ కే ద్వేష్ సే
హోగయా సంహార్ పూరే దేశ్ కా.

**అనువాదము :** వ్యర్థం వ్యర్థం యుద్ధం
వృథా, వృథా విధ్వంసం
ఫల శూన్యం మహాభారతం
ఐదుగు రసహిష్ణుల ద్వేషం
చేసెను భువి హూనం హూనం.

ఈ అనువాదములు చూచినచో మూలమున కెంత దగ్గరగా నున్నదియును తెలియును. ఇక భాష. "శరగురి, జనమన దద్దమ్మ తనం, కోలాహలజోలి, పరాభవ పగ, భ్రాంతిజన్యహోగమంచు, ప్రేత కృత విసురులు" ఇత్యాదులు చాల యున్నవి—ఒక నూతన దృక్పథముతో వ్రాయబడిన హిందీ కావ్యమును సాహసించి తెనుగుచేసి ఔత్తరాహుల ఊహాపథములను తెనుగుల కెరుకపరచి నందుకు శ్రీ రామచంద్రరావుగా రభినందనీయులు.

—క్షేమేంద్ర.

# తెరమెరుగులు

అయిదు నాటికల సంపుటి

శోభాప్రచురణలు

విజయనగరంనుండి ప్రకటించిన మూడవ ప్రచురణ

సంపాదన - ప్రచురణ : శ్రీమతి ఆర్. వి. రమణమ్మ

క్రౌనుసైజు 140 పేజీలు వెల : రూపాయిన్నర

ఇందులో రావి కొండలరావు రచించిన 'కుక్కపిల్ల దొరికింది', పోతుకూచి సాంబశివరావుగారి "దొంగ", హితశ్రీ రచన "తెల్లవారింది", కొండముది శ్రీరామచంద్రమూర్తిగారి "తెరమరుగు నీడలు", అంగర సూర్యారావుగారి "స్త్రీలకు ప్రత్యేకం" ఉన్నాయి. "తెరమరుగు నీడలు" ఉగాది సంచికలోనూ, మిగిలినవి 'భారతి' లోనూ ఇదివరలో వెలువడినవే. అదీగాక ఈ నాటికలన్నీ ఆంధ్రదేశమంతటా అమెచ్యూర్ నాటకసంఘాలు ఆడుతున్నవే. 'కుక్కపిల్ల

దొరికింది' నాటికకు పోటీలలో బహుమానం లభించింది. రేడియోలో 1956 వినోదోత్సవాలలో ప్రసారమయింది. తప్పిపోయిన కుక్కపిల్లకోసం తహతహ లాడే ఒక ధనికుడూ, ఆ ధనికుని తహతహం తీర్చడానికి ఆరాటపడే ఒక యువకుడూ ఈ నాటికలో వస్తారు. నాటిక మొదటినుండి చివరివరకు 'సస్పెన్స్' తో నడుస్తుంది. స్త్రీ పాత్రలూ ఎక్కువ సీను మార్పులూ సెట్టుల మార్పులూ లేని కారణంచేత ప్రదర్శనకు అనువైనది. సంభాషణలు చమత్కారంగా నడిపించిన కారణంచేత కొంత వినోదం సాధించగలిగారు. అయితే ఈ కథకు బీజం ఒక వోడ్‌హౌస్ రచనలో ఉంది. దానినే ఇదివరకు బుద్ధవరపు నాగరాజామాత్యుడు నాటకీకరించాడు. ఇది దాని అనుసరణ అయినా కాకపోయినా బాగానే వినోదం సాధించిందనవచ్చు. అందుకే ఇది జయప్రదంగా ఇన్ని ప్రదర్శనలు పొందింది.

అలాగే నీతుకూచి సాంబశివరావుగారి "దొంగ" కూడ ప్రదర్శన యోగ్యమైన నాటిక. ఇందులో పాత్రలు తక్కువ. ఒకేరంగం, ఒకేదృశ్యం. పాత్రలు వస్తారు, పోతారు. దొంగ అయిన రంగయ్య నిలుస్తాడు 'నిరసనతో విదిలింపబడిన జీవితాలుఒక్కొకసారి సిరాశతో నీచానికి నిలయమౌతాయి' అనే భావనమీద రంగడిపాత్ర రూపొందించాడు. ఇతడు, ఒక కులటకు పుట్టి సంఘం స్వీకరించక వెలిగా పెరిగి సమాజంమీద పగబట్టిన "దొంగ". అతని తల్లి తిరిగి చీకటి తప్పుచేసి మరొక బిడ్డనుకంటే, ఆమెనువదలి నికృష్టజీవితం జీవించి చివరికి జూదరి అవుతాడు. త్రాగుబోతు అవుతాడు. అతని సోదరుడు బూట్ పాలిష్ బాయ్‌గా, పార్కులో కనిపిస్తే అతనిని దగ్గరకు చేర్చుకొని - మమతల మాధుర్యంలో మానవనైజమే మారుతుంది అంటాడు ఆ పార్కులో అతడు మోసం చేసిన మరికొన్ని పాత్రలు నాటకానికి బిగువుతెచ్చి, కొంత వినోదంతో పాటు ఈదొంగ పాత్రమీద కొత్తవెలుగు ప్రసరింపజేస్తాయి. కరుణరస ప్రధానమైన ఈ నాటిక మన సాంఘికజీవితంమీద చురకలాంటి వ్యాఖ్య. ప్రదర్శన చూస్తుంటే విశ్రాంతికలిగించే సన్నివేశాలు అనేకం ఉన్నవి. హితశ్రీ వ్రాసిన "తెల్లవారింది" అనే నాటికకూడ ఏకాంకికే. ఆరుపాత్రలు. ఒకటే రంగం. మధ్యతరగతి కుటుంబీకుడైన లాయరు రామమూర్తి జీవితంలో ఒకరోజు. ఇద్దరు మగపిల్లలూ, ఒక ఆడపిల్ల. ఇందులో పెద్దవాడు ఆనర్సు ప్యాసయి ఉద్యోగంకోసం పెళ్ళికోసం ఎదురుచూస్తున్న నిరుద్యోగి. "పద్మ" పెళ్ళివారు వస్తారని ఎదురుచూచి ఆశాభంగం పొందిన పెళ్ళికుమార్తె. "కిష్టు" పరీక్షకు వెళ్ళి, ఫలితాలలో తన నంబరు కనిపించీ కనిపించక ఆశాభంగం పొందిన విద్యార్థి. ఇంక రామమూర్తి ఎవరో పార్టీలు వస్తారని ఆశపడితే, ఆ వచ్చినపార్టీ ఇళ్ళపన్ను వసూలుచేసే బిల్లుకలెక్టరు అయ్యేటప్పటికి ఆశాభంగంపొందిన లాయరు. ఇలాంటికుటుంబం వారితో వియ్యమందడానికి

వచ్చిన పెళ్లిళ్ల పేరయ్యలు విశ్వనాధశాస్త్రి, పేరయ్యశాస్త్రి పెళ్ళిమాటలు కదిపి కొంతఆశాభంగం పొందుతారు. కాని విశ్వనాధశాస్త్రి సాముద్రికం తెలిసినట్టు నటించి అందరికీ కొంత ఆశకల్పించే జోశ్యంచెప్పి, తిరిగి ఆశలుకల్పించి, వారి భావాలలో మార్పుతెస్తాడు. ఈనాటికలో సంభాషణలు చాలవేగంగా నడిచాయి. పాత్రలు చురుగ్గా తిరుగుతాయి. నాటకీయమైన సన్నివేశం గొప్ప దేమీ లేకపోయినా నేటి మధ్యతరగతి కుటుంబజీవితంమీద చక్కని వెలుగు ప్రసరింపజేస్తున్నది. సంభాషణలు నడిపించే తీరులుఉన్న నైపుణ్యం ఈరచయితకు సన్నివేశాలు కూర్చడంలోఉంటే మంచినాటిక వ్రాయవచ్చు. "తెరమెరుగు నీడలు" అనే నాటికలో కనకారావుఅనే వ్యాపారి విశ్వనాధంఅనే భాగస్వామీ రాగిణి అనే అమ్మాయితో స్నేహంచేస్తూ వుంటారు. కనకారావు షష్టిపూర్తి చేసుకొంటున్న ముసలివాడు, విశ్వనాధం నలభై అయిదేళ్ళ విలాసపురుషుడు. వాళ్ళిద్దరూ, ఒకనాటకంకొని అది వేయించడానికి పోటీపడి ఆరచయిత రామదాసును మోసం చేయబోతారు. రామదాసు పేదవాడు. దారిద్ర్యం వల్ల తల్లీ, భార్య మరణిస్తారు. తాను కనకారావుచేతిలో చచ్చినట్టు పడిపోతే ఆత్మహత్యఅని ఈభాగస్థులు తేలుస్తారు. చివరికి ఇతడు జీవించే ఉంటాడు. ఇందులో, పాత్రలూ, సన్నివేశాలూ, సంభాషణలో అన్నీ కృత్రిమంగానే ఉన్నవి. రచయిత ఎందుకోసం ఈనాటిక వ్రాసిందీ అర్థంకాదు. ఇందులో ప్రదర్శనకు సులువైన వీలుతప్ప, నాటికలో విశిష్టత మరేమీలేదు. ఇంక అయిదవనాటిక "స్త్రీలకు ప్రత్యేకం"లో అన్నీ స్త్రీపాత్రలే. ఒకేదృశ్యం. అది మహిళామండలి కార్యాలయంలో వార్షికోత్సవంనాడు. సభకిముందు జరిగిన ఉదంతం. మగవాళ్ళు సంఘాన్ని పాడుచేస్తున్నారు, స్త్రీలకి ప్రత్యేకంగా అన్నీ ఉండాలి అనే అభిప్రాయంకలవారి సంఘంవారు ప్రదర్శించిన అంతర్నాటకం ఒకటిఉంటుంది. నాటిక జాగ్రత్తగా నిర్వహించగల నేర్పుగల ఈరచయిత నాటికలోని అంతర్నాటికతో ఒక గొప్పఎఫెక్టు తీసుకొనివచ్చారు. ఇందులో కథావిధానంకంటె నాటకనిర్మాణం బాగాఉంది. స్త్రీలు ప్రత్యేకంగా పురుషపాత్రలు లేకుండా ప్రదర్శించటానికి అనువైననాటిక. మొత్తంమీద ఈఅయిదు నాటికలు రంగస్థల ప్రదర్శనకు వీలైనవి. వీటిచివర రచయితల సంగ్రహ పరిచయంకూడా ఇచ్చారు. 'శోభా ప్రచురణలు వ్యాపారసంస్థకాదు. ఒక ఉద్యమం, రచయితలమధ్య స్నేహాన్నీ సౌహార్ద్రాన్నీ పెంపొందించడం, ఉత్తమ రచనలు ప్రచురించడం తమలక్ష్య'మని ప్రకాశకులు "మనవి" చేసుకున్నారు. వారిమనవి ఆలకించి పలువురు పోషకులు సహాయకులూ ఈఉద్యమానికి సహాయం చేస్తున్నారు. వారు ఈ లక్ష్యాన్ని అనుసరించి ప్రచురించిన ఈ ఉత్తమ నాటికల సంపుటి ప్రదర్శకులకు అత్యంతోపయోగకరంగా ఉంటుందనడానికి సందేహంలేదు. తెలుమెలుగులు అనే శీర్షికగల ఈసంపుటంలోని నాటికలు నిజంగా "తెరమెలుగులే."

—శ్రీ వాత్సవ.

# దక్షిణభారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

## ఖైరతాబాదు - హైదరాబాదు-4

## మా తెలుగు ప్రచురణలు

| | | |
|---|---|---|
| నెలవంక | .... | రు. 2-00 |
| ప్రహ్లాదచరిత్రము | .... | 1-50 |
| శ్రీకృష్ణరాయబారము | ... | 1-50 |
| కథాతోరణము | .... | 2-00 |
| కావ్యతోరణము | .... | 1-50 |
| హిమబిందు | .... | 2-50 |
| ప్రతిజ్ఞాయౌగంధరాయణము - స్వప్నవాసవదత్త | | 1-50 |
| దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు జీవితము | (మొదటి భాగము) | 2-25 |
| వ్యాసరత్నావళి | .... | 2-00 |
| నెహ్రూచరిత్ర | .... | 2-50 |
| హిందీప్రచారోద్యమము - దాని స్వరూపము | | 0-75 |

★

*ఇవిగాక దక్షిణభారత హిందీప్రచార సభ పరీక్షలకు కావలసిన పుస్తకములు, లైబ్రరీలకు పనికివచ్చు హిందీ సాహిత్యమునకు సంబంధించిన వివిధ పుస్తకములు మావద్ద లభించును.*

Edited, Printed and Published by V. Anjaneya Sharma, 959 Khairatabad, Hyderabad-4 & Printed at Ajanta Printers, Mahakali St., Secunderabad.